# అంకితము

పూజ్యశ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు

బాబుగారికి

# మనవి మాటలు

'గ్రంథాలయగీతాల' ప్రచురణకు పిమ్మట దాదాపు 3 సంవత్సరాల అంతరాయంతో మా అధ్యక్షులు పూజ్యశ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్తి ప్రచురణములలో అయిదవ గ్రంథాన్ని నేటికి వెలువరించ గలిగినాము.

మదరాసు రాష్ట్రంలో ఇకపైన గ్రంథాలయోద్యమం హెచ్చుగా మదరాసు పౌరగ్రంథాలయముల చట్టముపై ఆధార పడి నడువవలసియున్నందున దీని వివరాలను గ్రంథాలయాల కార్యకర్తలకు, ఉద్యమాభిమానులకు వెల్లడిచేయు తలంపు తోనూ, ప్రస్తుతచట్టాన్ని ఉద్యమాభివృద్ధి కనుకూలంగా యెట్లు మార్చుకోవచ్చునో వారికి సూచించు ఉద్దేశంతోనూ ప్రస్తుత గ్రంథాన్ని మేము ప్రకటించుచున్నాము.

ఇందలి ౨, ౩, ౪, ౫ అధ్యాయాలు ఆంధ్ర దిన పత్రికలో **1950** సంవత్సరాంతమున ప్రకటింపబడినవి. ఇందుకు గ్రంథాలయ కార్యకర్తలందరూ ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాదుగారికి కృతజ్ఞులై యుండగలరు. ఈఅధ్యాయాలలో మదరాసు పౌరగ్రంథాలయముల చట్ట స్వరూపము స్థూలముగా వర్ణింపబడినది. చట్టంలోని ముఖ్యవిషయాల వర్ణనతోపాటు ప్రధానమైన లోపాలుగూడ వీనిలో ఎత్తిచూపబడినవి. ౧, ౨ అధ్యాయాలలో ప్రస్తుత చట్టము యొక్క పూర్వాపరములు విశదీ

కరింపబడినవి. ఈచట్టు నిర్వహణ విషయమై ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారి సూచనలు కొన్ని అనుబంధములో వెల్లడింపబడినవి.

## కృతజ్ఞత

మదరాసు పౌరగ్రంథాలయముల చట్ట నిర్మాణానికి మూలకారకులు ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్ అధ్యక్షులు డాక్టరు యస్. ఆర్. రంగనాథన్‌గారు. దీనిని మన శాసన సభలలో ప్రవేశపెట్టి తీర్మానం చేయించిన వారు మన మాజీ విద్యామంత్రులు శ్రీ టి. యస్. అవినాశిలింగం చెట్టిగారు. దీనిని ప్రజోపయోగంగా మార్పించుటకై కొంచెం ప్రయత్నపడినవారు పూజ్యశ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు. కనుక ముఖ్యంముగా ఈ త్రిమూర్తులకు నా జోహారులర్పించుచున్నాను. ఈ గ్రంథంలో చేర్చుటకై మదరాసు గ్రంథాలయ చట్టపుకథను వ్రాసియిచ్చిన మదరాసు గ్రంథాలయ సంఘ సహాయకార్యదర్శి శ్రీ కే. యం. శివరామన్‌గారికి నా ప్రత్యేకాభినందనములను చెల్లించవలసి యున్నది. ఈగ్రంథ నిర్మాణంలో సహాయపడిన సారస్వతోపకరణాలు ఆరవ అధ్యాయం తర్వాతగలవు. ఈసారస్వత కర్తలందరూ గ్రంథకర్త కృతజ్ఞతకు పాత్రులు. చట్ట నిర్మాతలైన మదరాసు ఉభయ శాసనసభల సభ్యులుకూడ మనకు వందనీయులు.

పటమటలంక
౩౧-౧౦-౧౯౫౧

[illegible]
గ్రంథకర్త

# విషయసూచిక

"వాయువెల్లవారికి నెట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ నట్లు స్వాధీనము కావలయును.

ఉదకమెల్లవారికినెట్లు సేవ్యమైయున్నదో
జ్ఞానమునునట్లు సేవ్యమై యుండవలయును.

సూర్యచంద్ర మండలముల తేజస్సు
ఎల్లవారికినెట్లు సౌఖ్యప్రదముగ నున్నదో
జ్ఞానమును నట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును."

## మదరాసు పౌర గ్రంథాలయముల చట్టము

# అధ్యాయము ౧

### ఉపోద్ఘాతము

మొదటి గ్రంథాలయ శాసనం :

ప్రపంచంలోని మొదటి గ్రంథాలయశాసనం సరిగా నూరేండ్ల క్రితం తీర్మానమైనది. దీనిని లోకానికి ప్రసాదించిన గౌరవం బ్రిటిష్‌వారికి దక్కింది. శాసన నిర్మాణంద్వారా ప్రభుత్వం గ్రంథాలయ సేవకు పూనుకొనవలసిన విధిని 'ఎవర్టు' అను మహనీయుడు గ్రహించి 1850 వ సం॥ లో సామాన్యమైన ఒక చట్టాన్ని యితడు బ్రిటిష్‌పార్లమెంటులో ప్రవేశపెట్టినాడు. మామూలుపన్ను మొత్తములో పౌను 1 కి అరపెన్నీ సెస్సును విధించుకొని పురపాలక సంఘాలు గ్రంథాలయాలను స్థాపించుకొనడానికి 'ఎవర్టు చట్టం' అవకాశ మిచ్చినది. ఇది అమలు జరగడానికి ఆయాపట్టణాలలో శిస్తులు చెల్లించే పౌరులలో మూడింట రెండు వంతుల జనం సమ్మతించాలి. ప్రజాభిప్రాయానికి పూర్తిగా అవకాశ మిస్తూ చేయబడిన యీ ప్రతిపాదనకు ఆనాటి పార్లమెంటులో పెద్ద వ్యతిరేకత బయలుదేరినది. ఎంతో కష్టంమీద 17 వోట్ల మెజారిటీతో * 'ఎవర్టు చట్టం' నెగ్గింది. కాని

* అనుకూలురు 118 మంది; వ్యతిరేకులు 101 మంది.

4 సంవత్సరాల తర్వాత గ్రంథాలయ సెస్సును అరపెన్నీ నుండి పెన్నీకి పెంచుటకై 'ఎవర్టు' యీ చట్టమునకు సవరణను ప్రతిపాదించగా పార్లమెంటులో ఆ సమయమున హాజరుగావున్న 83 మందిలో 22 మంది మాత్రమే సవరణకు వ్యతిరేకముగ వోటుచేసిరి. చర్చసమయమున సభ్యులు పలువురు 'ఎవర్టు చట్టము' ద్వారా కలిగిన ప్రయోజనముల నుగ్గడించిరి. కొందరు 'ఎవర్టు' నభినందించిరి. తర్వాత అభివృద్ధికరములగు మరికొన్ని మార్పులీచట్టములో చేయబడినవి. 1919 వ సం॥ నాటికీచట్టము సమగ్రము చేయబడినది. ఈ సమగ్రచట్టము వోటు తీసుకోవలసిన అవసరము లేకుండగనే తీర్మానమైనది. ఈ విషయము బ్రిటిష్ ప్రజలు గ్రంథాలయశాసన ప్రయోజనములను గుర్తించిరనుటకు నిదర్శనముగానున్నది.

మదరాసు శాసనపు పుట్టు పూర్వోత్తరాలు :

జనసామాన్యంలో ప్రతియొక్కరికీ కావలసిన విజ్ఞానాన్ని అందజేయడానికి గ్రంథాలయాలు పూనుకోవలసిన విధిని గ్రహించిన నాగరక దేశాలొక్కొక్కటి బ్రిటను ననుసరించి తమతమదేశాలలో గ్రంథాలయ శాసనాల నేర్పరచుకొన్నవి. ఈ శాసనాల ద్వారా అర్థబలమును, అంగబలమును సమకూర్చుకొని అచ్చటి గ్రంథాలయాలు ప్రజానీకాని కెంతగనో ఉపకరించుచున్నవి. ఈ సంగతిని గుర్తించిన మదరాసు గ్రంథాలయ సంఘు నిర్వాహకులు మనరాష్ట్రమున గ్రంథాలయ శాసనమును

నిర్మించుటకు సంకల్పించినారు. ఈసంఘకార్యదర్శి శ్రీ యస్. ఆర్. రంగనాథన్‌గారు 1930వ సం॥లో మదరాసు రాష్ట్రానికొక చిత్తుశాసనాన్ని తయారు చేసినారు. దీనిని వీరు 1930వ సం॥ డిసెంబరునెలలో కాశీలో కూడిన ప్రథమ ఆసియా విద్యామహాసభలో చర్చకు పెట్టినారు. దీని ఆధారంపై ఒకశాసనాన్ని వ్రాయడానికి మదరాసు గ్రంథాలయ సంఘమువారు రంగనాథన్‌గారితో కలుపుకొని ముగ్గురు సభ్యులతో ఒక ఉపసంఘాన్ని నియమించినారు. వీరుతయారు చేసిన ప్రణాళిక నీసంఘమువారు ప్రకటించి రాష్ట్రంలోని జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, తాలూకాబోర్డులకు అభిప్రాయం నిమిత్తం పంపినారు. ఆనాటి మదరాసు రాష్ట్ర శాసనసభలో నున్న తమసంఘసభ్యులద్వారా దీనిని శాసనసభలో ప్రవేశపెట్టుటకు వీరు కృషిచేసినారు. దీనికి రాజప్రతినిధి ఆమోదాన్ని వీరు సంపాదించినారు. దీనిపైన 1933 ఆగస్టులో యీ బిల్లు మదరాసు శాసనసభలో బషీర్ అహమ్మద్ సయ్యద్‌గారిచే ప్రవేశపెట్టబడినది. 1933 నవంబరు 10వ తేదీన యీ బిల్లు 37 మంది సభ్యులతో కూడిన సెలెక్టుకమిటి విచారణకు పంపునట్లు తీర్మానింపబడినది. ఈ సెలెక్టుకమిటీవారు పలుమారు సమావేశమై తమనివేదికను సిద్ధపరచి శాసనసభవారి కందజేసినారు. కాని తదుపరి దీనిపై చర్చ అమలు జరుగకుండా నిలిచిపోయినది.

1937వ సం॥లో మనరాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గమేర్పాటైనప్పుడు ఈ విషయంలో వీరి ప్రయత్నములు తిరిగి ప్రారంభమైనవి. ఇందుకొరకు 27-8-1938వ తేదీన

అప్పటి ప్రధానమంత్రి శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులవారిని వీరి రాయబారవర్గంవారు కలుసుకొన్నారు. గ్రామపట్టణ ప్రాంతాలలో గ్రంథాలయ సేవకు అవకాశాలు కల్పించగల శాసననిర్మాణావశ్యకతను వీరు ప్రధానమంత్రికి విన్నవించినారు. స్థానికసంస్థలు గ్రంథాలయాలను నిర్వహించడానికి చట్టరీత్యా అవకాశమున్నప్పటికీ గ్రంథాలయాల కార్యక్రమం కట్టుదిట్టంగా సాగడానికీ, వివిధప్రదేశాలలో వేరువేరు యాజమాన్యాలక్రింద జరుగుతున్న కార్యక్రమంలో సమన్వయం కుదరడానికీ యేర్పాటు చేయగల విధానం అవసరమని వీరు మంత్రిగారికి నివేదించినారు. ఇదంతావిని గ్రంథాలయోద్యమ నిర్వహణంలోగల చిక్కులను పరిశీలించి పరిపాలనా సంబంధమైన ఆర్డరులద్వారా ప్రస్తుతమున్న లోపాలను తొలగించడానికివీలుంటుందేమో ప్రయత్నిస్తామనీ, అవసరమైతే వీరితో సంప్రతిస్తామని మంత్రిగారు జవాబు చెప్పినారు.

తదుపరి **1942** వ సం॥ లో బొంబాయిలో సమావేశమైన అయిదవ అఖిలభారత గ్రంథాలయ మహాసభవారికి నివేదించు నిమిత్తం డాక్టరు రంగనాథన్‌గారు మాదిరి పౌర గ్రంథాలయ చట్టాన్ని తయారుచేసినారు. **1947** వ సం॥ ప్రారంభంలో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు గ్రంథాలయ శాసనావశ్యకతను మదరాసు ప్రభుత్వానికి నివేదించినారు. ఇందుపై నాటి మన విద్యామంత్రి శ్రీ టి. యస్. అవినాశలింగంచెట్టిగారు ఒక బిల్లును తయారుచేసినారు. ఈ బిల్లు **1947** వ సం॥ డిసెంబరు **9** వ తేదీన ఫోర్టు

సెంట్ జార్జి గజెట్టులో ప్రకటించబడినది. దీని వివరములు రాష్ట్రములోని పత్రికలలో కెక్కినవి. వివిధ పత్రికలు, ప్రముఖ గ్రంథాలయోద్యమ నిర్వాహకులు దీనినిగూర్చి తమఅభిప్రాయములను, విమర్శనలను వెల్లడించినారు. దీని విచారణనిమిత్తం ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు 1948 వ సం॥ జనవరి 16 వ తేదీన పటమటలంకలో సంఘాధ్యక్షులు శ్రీగాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను ప్రత్యేక మహాసభను జరిపినారు. ఈమహాసభను మదరాసు అసెంబ్లీ డెప్యూటీ స్పీకరు శ్రీమతి చోడగం అమ్మన్న రాజాగారు ప్రారంభించినారు. ప్రభుత్వంవారు ప్రకటించిన చిత్తుచట్టమును సభవారు సాకల్యముగా పరిశీలించి, తమ నిర్ణయములను మహాసభ తీర్మానములలో ఇమిడ్చినారు. ఈతీర్మానములననుసరించి ప్రభుత్వంవారు ప్రకటించినబిల్లుకు సవరణలను తయారుచేసి ఆంధ్రదేశగ్రంథాలయసంఘమువారు ప్రభుత్వమున కందజేసినారు. ఇందుకొరకు శ్రీ హరిసర్వోత్తమరావుగారి నాయకత్వమున విద్యామంత్రివద్దకు రాయబారముకూడ నడచినది. బిల్లుపరిశీలనమున కేర్పాటు చేయబడిన సెలెక్టు కమిటీయెదుట హాజరై శ్రీ హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమువారి అభిప్రాయములను స్పష్టపరచినారు. ఇంత తతంగము జరిగినను సెలెక్టు కమిటీవారు దీనినంతను సరకుగొనక మొదట ప్రకటించిన బిల్లులోని లోపములను సరిచేయకపోగా దీనికి విరుద్ధమై ఇంతకంటె అన్యాయముగా నున్న క్రొత్త పద్ధతితో శాసనమును తయారుచేసి దీనికి ఉభయశాసనసభల ఆమోద

ముద్రను పొందినారు. **29-1-1949**వ తేదీన యిది గవర్నర్ జనరల్ అంగీకారమును సహితము బడసి 8-**2-1949**వ తేదీ ఫోర్టు సెంట్ జార్జి గజెట్టులో ప్రకటితమైనది.

నిబంధనలు :

ఈ శాసనము ద్వారా లభించిన అధికారమును పురస్కరించుకొని మదరాసు గవర్నరుగారొక ఉత్తర్వును జారీచేసిరి. **1950** వ సం॥ ఏప్రిల్ **1** వ తేదీ నుండి మదరాసు పౌర గ్రంథాలయ చట్టము అమలుజరుగునని వీరి ఉత్తరువుద్వారా ప్రకటనచేసిరి. విద్యాశాఖ డైరెక్టరు గ్రంథాలయాల డైరెక్టరుగా కూడా నుండగలరని యిందు తెలిపిరి. జిల్లాలలోని విద్యాశాఖాధికారియొక్కరు ఆజిల్లా గ్రంథాలయ సంస్థకు సభ్యుడుగ, సమావేశకర్త (కన్వీనరు) గ, కార్యదర్శిగ నుందురనియూ నీఉత్తరువులో సూచించిరి. మదరాసులోని కన్నెమరాపబ్లిక్ లైబ్రరీ **1950** వ సం॥ ఏప్రిల్ **1** వ తేదీనుండి రాష్ట్రకేంద్ర గ్రంథాలయుంగా పరిగణింపబడునట్లు తీర్మానించిరి. నాటినుండి యీ గ్రంథాలయం గ్రంథాలయాల డైరెక్టరుగారి అధీనమున నుండగలదని ప్రకటించిరి. మదరాసుకార్పొరేషన్ కమీషనరు, జిల్లాబోర్డుల అధ్యక్షులు, మునిసిపాలిటీల కార్యనిర్వాహకులు లైబ్రరీసెస్సును వసూలుచేసి ఆయాస్థానిక గ్రంథాలయ సంస్థలకు చెల్లించవలసినదిగ కోరిరి. గ్రంథాలయ శాసనంలోని **18**వ సెక్షన్ **1**వ పేరాలో సూచింపబడిన ప్రకారము దీని అమలున కవసరమైన నిబంధనలుకూడ పైఉత్తరువులో చేర్చబడినవి. ఈనిబంధనల ప్రకట

నకుముందు ఈ విషయంలో అనుభవంగలవారి సలహాలను ప్రభుత్వం తీసుకొనలేదు. ప్రజాభిప్రాయం నిమిత్తం వీనిని ప్రకటించనూలేదు. ఈ నిబంధనలు మూలశాసనంలోని కొన్నిషరతుల కాఠిన్యాన్ని తగ్గించుటకు మారుగా హెచ్చు నిర్బంధములను గ్రంథాలయాలపై విధించినవి. ఈశాసనంద్వారా కలుగవలసిన మేలు యీ నిబంధనలమూలంగా కొంత కుంటుబడినదని చెప్పిన అతిశయోక్తి లేదు.

ఈ నిబంధనలు 5 అధ్యాయముల క్రింద విభజింపబడినవి. మొదటి అధ్యాయంలో రాష్ట్రీయ గ్రంథాలయ కమిటీ నిర్మాణము, అధికారములు, విధులు, స్థానిక గ్రంథాలయ సంస్థల సభ్యులలో యేర్పడు ఖాళీల భర్తీకి సంబంధించిన వివరము లియ్యబడినవి. ప్రభుత్వసహాయాని కర్హమైన గ్రంథాలయాల విషయాలు రెండవ అధ్యాయంలో గలవు. ఆర్థిక వ్యవహారములకు సంబంధించిన కొన్ని సంగతులు 3 వ అధ్యాయంలోను, స్థానిక గ్రంథాలయ సంస్థల కార్యక్రమ నిర్వహణకు సంబంధించిన సూచనలు 4 వ అధ్యాయంలోను చేర్చబడినవి.

స్థానిక గ్రంథాలయ సంస్థలు తయారుచేసి నివేదించవలసిన ప్రణాళికలకు సంబంధించిన వివరాలు 5 వ అధ్యాయములో చేర్చబడినవి.

ప్రతిస్థానిక గ్రంథాలయ సంస్థయు మొదట తాత్కాలికమైన ప్రణాళిక నొకదానిని సిద్ధపరచవలెను. తాము సంకల్పించిన ప్రణాళిక పూర్తిగా అమలు జరుగునప్పటికి తమ

యేరియాలో నుండవలసిన ప్రధాన గ్రంథాలయాలు, శాఖా నిలయములు, డెలివరీస్టేషనుల సంఖ్యను నిర్ణయించవలెను.

ఈతాత్కాలిక ప్రణాళికలో దిగువ వివరములను యింకా అవసరమైన సమాచారములను యివ్వవలెను.

1. తమయేరియాలోని 50,000, అంతకుపైబడిన జనాభాగల ప్రతి పట్టణము యొక్క పటము అందలి ప్రధాన గ్రంథాలయము, శాఖానిలయముల స్థానమును నిర్దేశించు గుర్తులు.

2. ప్రతిపట్టణం పటములోను

(అ) ఒక ప్రధాన గ్రంథాలయము

(ఆ) ఒక్కొక్క డివిజను లేక 25,000 జనాభాకు ఒక శాఖానిలయమును సూచించవలెను.

3. ప్రతిజిల్లా ప్రాంతమునకు ఒక పటము – ఇందులో పట్టణముల స్థానములను, ప్రధాన గ్రంథాలయము, శాఖా నిలయములు, డెలివరీ స్టేషనుల స్థానములను ప్రత్యేకము సూచించు గుర్తులు.

4. గ్రామీణ ప్రాంతములు లేక జిల్లాలోని పట్టణములను మినహాయించగా మిగులు జిల్లాబోర్డు ప్రాంతముల పటములలో

(అ) కనీసం ఒక ప్రధానగ్రంథాలయము (అవసరాన్ని బట్టి వీని సంఖ్యను పెంచవచ్చును).

(ఆ) 5 వేలనుండి 50 వేలకు మధ్య జనాభాగల ప్రతి పట్టణములోనూ ఒక శాఖానిలయము.

(ఇ) వెయ్యికి తక్కువ జనాభాగల వరుసగానున్న 3 పల్లెల కొక్కటి చొప్పుననూ, వెయ్యినుండి అయిదువేలకు లోబడిన జనాభాగల ప్రతి గ్రామమున కొక్కటి చొప్పునను డెలివరీస్టేషనులను గుర్తు పెట్టవలెను.

5. దిగువ శీర్షికలక్రింద పై పటములో తెలుపబడిన వివరముల స్టేటుమెంటును తయారు చేయవలెను.

(అ) ప్రతిపట్టణముయొక్క—

(i) డివిజను లేక పేట

(ii) విస్తీర్ణము

(iii) జనాభా

(iv) శాఖానిలయము

కడపటిపంక్తిలో మొత్తముల నివ్వవలెను.

(ఆ) ప్రతిజిల్లాకు

(i) విస్తీర్ణము

(ii) జనాభా

(iii) నగరముల సంఖ్య

I పట్టణముల జనాభా మొత్తం

II పట్టణములలోని శాఖానిలయముల సంఖ్య

(iv) పట్టణములసంఖ్య, వాని జనాభా మొత్తం

(v) మిగిలిన జనాభా

(vi) గ్రామములసంఖ్య, వానిజనాభా మొత్తం

(vii) పల్లెలసంఖ్య, వాని జనాభా మొత్తం

(viii) డెలివరీ స్టేషనుల సంఖ్య

కడపటి పంక్తిలో మొత్తము నివ్వవలెను.

గ్రంథాలయాల డైరెక్టరు ఈ విధంగా తయారు చేయబడిన స్థానిక గ్రంథాలయ సంస్థల తాత్కాలిక ప్రణాళికలలోని స్టేటుమెంటులను, తమ విచారణఫలితంగా గ్రంథాలయసేవపట్ల స్థానికంగాకనబడు ఆసక్తి, అవసరముల అంతస్థుల నొకటిగా చేర్చి పెట్టును.

తదుపరి యీ ప్రణాళికల నిర్వహణ విషయమై రాష్ట్రీయ గ్రంథాలయ కమిటీ సలహా తీసుకోబడును. రాష్ట్రీయకమిటీ దిగువ విషయములను గమనములో పెట్టు కొని తాత్కాలికంగా ఒక కార్యక్రమమును నిర్ణయించును.

1. స్థానిక గ్రంథాలయ సంస్థల ప్రణాళికలు

2. డైరెక్టరు సిద్ధపరచిన నివేదికలు

3. అవసరమైన సుశిక్షిత సేవకబృందము తయారగుటకు పట్టుకాలము

4. భవననిర్మాణమునకు పట్టుసమయము
5. బీరువాలుమున్నగు పరికరములను సమకూర్చుకొనుటకు పట్టుకాలము
6. ప్రజల శక్తికిమించని లైబ్రరీసెస్సుద్వారా గడించగల మొత్తము
7. ప్రభుత్వం భవనాలు, పరికరాలు, పుస్తకాలు వగైరాల నిమిత్తం వెచ్చించవలసిన ప్రారంభ ఖర్చులు, పౌర గ్రంథాలయాలకు ఇతర (ఎయిడెడ్) గ్రంథాలయాలకు యివ్వవలసియుండు వార్షిక విరాళాల కగు మొత్తము.

రాష్ట్రీయకమిటీ నిర్ణయాలను తాత్కాలిక కార్య క్రమమును ప్రభుత్వం పరిశీలించి చేయుతీర్మానం ఆధా రంతో స్థానిక గ్రంథాలయసంస్థలు సమగ్ర ప్రణాళికలను తయారుచేసి పంపవలెను. ఈ ప్రణాళికలలో చేర్చదగిన అంశ ములను గూర్చి డైరెక్టరు ఎప్పటికప్పుడు స్థానిక గ్రంథా లయ సంస్థలకు సలహా లిచ్చుచుండును.

# అధ్యాయము ౨

## రాష్ట్ర గ్రంథాలయ కమిటీ

నిర్మాణము :

గ్రంథాలయాలకు సంబంధించి ప్రభుత్వంకోరే విషయాలను గురించి సలహాలు చెప్పేనిమిత్తం ప్రభుత్వం రాష్ట్ర గ్రంథాలయ కమిటీని నిర్మిస్తుందని మదరాసు పౌర గ్రంథాలయ శాసనంలో వుంది. ఈ కమిటీ నిర్మాణంవగైరా వివరాలు తర్వాతచేసిన నిబంధనలలో నున్నవి. 1950 ఏప్రిల్ 1 వ తేదీ నుండి అమలులోనికి వచ్చిన యీ నిబంధనలలోని ప్రథమాధ్యాయంలో రాష్ట్రగ్రంథాలయ కమిటీ నిర్మాణము, అధికారాలు, విధుల వర్ణనము గలదు.

రాష్ట్రగ్రంథాలయ కమిటీలోని సభ్యుల వివరం మొదట యివ్వబడినది.

1. విద్యామంత్రి
2. స్థానిక స్వపరిపాలన శాఖామంత్రి
3. విద్యాశాఖ డైరెక్టరు (అధికారరీత్యా గ్రంథాలయాల డైరెక్టరు)

4. శాసననిర్వహణంలో డైరెక్టరుకు సహాయంగా ప్రభుత్వం నియమించే స్పెషలాఫీసరు
5. లెజిస్లేటివ్ కౌన్సిలు, లెజిస్లేటివ్ అసెంబ్లీ ప్రతినిధు లొక్కొక్కరు
6. మదరాసు, ఆంధ్ర, అన్నామలై విశ్వ విద్యాలయముల సిండికేటులు విడివిడిగా నియమించు ప్రతినిధులు ముగ్గురు
7. మదరాసు గ్రంథాలయసంఘము, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము, కేరళ గ్రంథాలయసంఘము, కన్నడ గ్రంథాలయ సంఘముల కార్యనిర్వాహకవర్గములు విడి విడిగా నియమించు ప్రతినిధులు నలుగురు.
8. విద్యామంత్రిచే నియమింపబడు గ్రంథాలయవేత్త యొకరు
9. మదరాసు నగర స్థానిక గ్రంథాలయసంస్థ సభ్యులలో నుండి విద్యామంత్రి నియమించువారొకరు
10. జిల్లాలలోని స్థానిక గ్రంథాలయ సంస్థల సభ్యులలో నుండి విద్యామంత్రి నియమించు వారిద్దరు యీకమిటీ సభ్యులు౧౫ నుందురు.

ఈ కమిటీకి విద్యామంత్రి అధ్యక్షుడు, స్పెషలాఫీసరు కార్యదర్శిగా వుంటారు. ఎలెక్షను ద్వారాగాని, నామినేషను ద్వారాగాని సభ్యులైన వారి సభ్యత్వం వారివారి ఎలెక్షను లేదా నామినేషను తేదీనుండి మూడేండ్లవరకు వుంటుంది. మధ్యకాలంలో ఏర్పడే ఖాళీలలో సభ్యులుగా

వచ్చేవారు తమకు ముందున్న సభ్యునికాలంలో మిగిలి యున్న కాలానికే సభ్యులుగా పరిగణింపబడతారు. కమిటీ సమావేశ స్థలాలను, సమయాలను విద్యామంత్రి నిర్ణయి స్తాడు. కమిటీ సమావేశాలకు హాజరుకావలసిన సభ్యుల కనీససంఖ్య అయిదు. విద్యామంత్రి హాజరుకాని సమావేశా లకు హాజరైన సభ్యులలో నుండి తాత్కాలికాధ్యక్షుణ్ణి ఎన్నుకోవడం జరుగుతుంది.

ప్రత్యేక సమస్యల పరిశీలన నిమిత్తం యీ కమిటీ వారు ఉపసంఘాలను యేర్పాటు చేయవచ్చు. ఈఉపసంఘా లను అచ్చంగా కమిటీ సభ్యులతోగాని, పూర్తిగా సభ్యే తరులతోగాని యేర్పరచవచ్చును. సభ్యులు కొందరి ని, సభ్యేతరులను కొందరిని కలిపికూడ వీనిని నిర్మించవచ్చును.

విధులు :

దిగువవిషయాలలో కోరినప్పుడు సలహాయిచ్చుటకు ప్రభుత్వం రాష్ట్రకమిటీని నియమించును.

1. కేంద్ర గ్రంథాలయము దీని శాఖలనిర్మాణము, లేదా ప్రస్తుతం అమలులో వున్న ఏదైనా ప్రభుత్వ భాండాగా రాన్ని, దీని శాఖలను కేంద్ర గ్రంథాలయంగా పరిగ ణించడం; కేంద్ర గ్రంథాలయం, దీనిశాఖల నిర్వహ ణానికొక విధానాన్ని యేర్పరచడం.
2. శాసనంలోని 18 వ సెక్షను ప్రకారం తయారు చేయవల సిన నిబంధనలు.

3\. (అ) రాష్ట్రప్రభుత్వం వారి గ్రంథాలయ విధానంలో తరగతులవారీగా సుశిక్షితులైన సిబ్బందిని నియమించుటకు ప్రోత్సహించుట.

(ఆ) తరగతుల వారీగా వున్న ప్రభుత్వామోదం పొందిన రాష్ట్రంలోని గ్రంథాలయ సిబ్బంది జాబితాను సిద్ధపరచి, యీ జాబితాలో చేరిన సభ్యుల నుండి ప్రభుత్వ గ్రంథాలయాలకు కావలసిన వారిని నియమించుట.

(ఇ) పై జాబితాలో చేర్చుటకు వివిధతరగతులకు చెందు గ్రంథాలయ సిబ్బందియొక్క విద్య, వృత్తిసంబంధమైన అర్హతల నిర్ణయము.

(ఈ) గ్రంథాలయాలలో పనిచేసే సిబ్బందిలో వివిధతరగతులకు చెందినవారి వేతన పరిమాణాలు, ఉద్యోగ నియామకాలకు సంబంధించిన సూచనలు.

4\. రాష్ట్రంలోని గ్రంథాలయాల ఉపయోగార్థం కాపీరైటు పుస్తకాల జాబితాలయు, గ్రంథపరణానికి సాయపడే గ్రంథాల జాబితాలయు ప్రచురణ.

5\. రాష్ట్రంలోని వివిధగ్రంథాలయాలు, ఇండియాలోని గ్రంథాలయాల మధ్య సహకార, సమన్వయ విధానాల అభివృద్ధికి, సహకార పద్ధతులపై గ్రంథవర్గీకరణము, లైబ్రరీ కేటలాగుల తయ్యారీకి కృషిసల్పుట;

గ్రంథాలయ భవననిర్మాణం, సామానుల యేర్పాటు గ్రంథాలయ నిర్వహణానికి సంబంధించిన సాంకేతిక విషయాలన్నింటికీ ప్రమాణములను నిర్ణయించుట.

6. గ్రంథాలయాల కుపయోగించే ఆచూకీ పుస్తకాల, వయోజనుల – పిల్లల గ్రంథాలయ ఉత్పత్తికి కృషి సల్పుట; అంధుల పుస్తకాల ఉత్పత్తికి, వినియోగానికి పాటుబడుట.

7. స్థానిక గ్రంథాలయ సంస్థలు ప్రభుత్వామోదం నిమిత్తం పంపిన ప్రణాళికల పరిశీలన

8. వివిధప్రాంతాలలో స్థాపించవలసిన గ్రంథాలయాల వేర్వేరు దశల విచారణ

విమర్శ :

ఒకటి రెండు విషయాలను వదలివేస్తే యీ కమిటీ నిర్మాణపద్ధతి బాగానే వుందని చెప్పవచ్చు. స్థానికగ్రంథాలయ సంస్థల ప్రతినిధులను మంత్రిగారు నియమించడంకంటె ఆసంస్థల సభ్యులే వారినెన్నుకొను యేర్పాటున్న బాగుండెడిది. విద్యాశాఖ డైరెక్టరుకు బదులు విషయజ్ఞుడైన ప్రత్యేకోద్యోగిని పూర్తి బాధ్యతతో గ్రంథాలయాలడైరెక్టరుగా నియమించిన యెడల హెచ్చు ప్రయోజన ముండేది. అప్పుడు స్పెషలాఫీసరుతో పని లేదు.

చాలవిషయాలలో అంత్య నిర్ణయం డైరెక్టరు అధీనంలో వుండడం మూలాన రాష్ట్ర కమిటీ వారిమాట

పాటింపునకు రాకపోవచ్చు. వీరిబాధ్యత సలహాలనీయడం వరకే. కనుక వీరి నిర్ణయాల విలువను ముందుగా లెక్క కట్టుటకష్టము. కాలం గడిస్తేగాని యీ కమిటీ స్థితి బయటపడదు. తక్కిన విషయాలెట్లున్నా స్థానిక గ్రంథాలయసంస్థలు తయారుచేయు ప్రణాళికలను పరిశీలించి సరిదిద్దు బాధ్యతనైనా రాష్ట్రకమిటీ కప్పగించిన బాగుండెడిది. ఆచరణలోనైనా దీనికవకాశం కల్పించి శాసన నిర్మాణంలో దొరలిన యీలోపాన్ని సవరించే ప్రయత్నం ప్రభుత్వం చేయగలిగితే గ్రంథాలయాల సక్రమ వ్యాప్తికి అవకాశం లభిస్తుంది.

# అధ్యాయము 3

## స్థానిక గ్రంథాలయ సంస్థలు

నిర్మాణము :

మదరాసు రాష్ట్రంలో పౌరగ్రంథాలయాల స్థాపన-నిర్వహణలనిమిత్తం వివిధ జిల్లాలలోను, మదరాసు నగరంలోను స్థానిక గ్రంథాలయ సంస్థలను యేర్పాటు చేయాలని 1948 వ సం.లో తీర్మానింపబడిన మదరాసు పౌరగ్రంథాలయ శాసనంలో వుంది. ఈ స్థానిక గ్రంథాలయ సంస్థల నిర్మాణ నిబంధన మదరాసు నగరానికొక విధంగాను, జిల్లాలకొక విధంగాను వున్నది.

మదరాసు నగర గ్రంథాలయ సంస్థలో మదరాసు కార్పొరేషనువా రెన్నుకొనువారు ముగ్గురు, ప్రభుత్వంవారు నియమించేవారు ఎనిమిదిమంది, ప్రభుత్వంవారు నిర్ణయించే ఉద్యోగి యొకరు సభ్యులుగా వుంటారు. ప్రభుత్వ నియమిత సభ్యులలో ప్రభుత్వంవారి ఆమోదం పొందిన నగరంలోని గ్రంథాలయాల కార్యకర్తలు ముగ్గురు, హైస్కూలు ప్రధానోపాధ్యాయులు లేదా ప్రధానోపాధ్యాయినులు ఇద్దరు, కాలేజీ ప్రిన్సిపాలు ఒకరు, ఇతరులిద్దరు వుంటారు.

జిల్లా గ్రంథాలయ సంస్థలలో ఒక్కొక్కదానికి పది మంది సభ్యులను గ్రంథాలయ డైరెక్టరు నియమిస్తారు. వీరిలో ముగ్గురు ప్రభుత్వంవారి ఆమోదం పొందిన ఆయా జిల్లాలలోని గ్రంథాలయాల కార్యకర్తలు, అయిదుగురు హైస్కూల్ల ప్రధానోపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయినులు, కాలేజీల అధ్యక్షులుగా వుంటారు. వీరికితోడు ఒక్కొక్క జిల్లాబోర్డు వారెన్నుకొను అభ్యర్థి యొకరు, తాలూకాకు ఒక్కరు చొప్పున ఆయాతాలూకాలలోని పంచాయతీ బోర్డుల అధ్యక్షులెన్నుకొను ప్రతినిధులు, దిగువలెక్క ప్రకారం ఎన్నుకోబడు మునిసిపాలిటీల ప్రతినిధులు, ప్రభుత్వం నిర్ణయించే ఉద్యోగి యొకరు జిల్లా గ్రంథాలయ సంస్థలో సభ్యులుగా వుంటారు.

లక్షకుమించని జనాభాగల మునిసిపాలిటీలు 'సభ్యును' లక్షకుపైబడి 2 లక్షలకు మించని జనాభాగల మునిసిపాలిటీలు ఇద్దరు సభ్యులను, 2 లక్షలకు పైబడ్డ జనాభాగల మునిసిపాలిటీలు ముగ్గురుసభ్యులను జిల్లా గ్రంథాలయ సంస్థల కెన్నుకోవచ్చును.

మదరాసు నగర గ్రంథాలయ సంస్థలోను, జిల్లా గ్రంథాలయ సంస్థలలోను ప్రభుత్వంవారు నిర్ణయించే ఉద్యోగులే ఆయా సంస్థలకు కార్యదర్శులుగా పని చేస్తారు. ఒక్కొక్క స్థానిక గ్రంథాలయ సంస్థయు తమ సభ్యులనుండి అధ్యక్షులుగా ఒకరినిఎన్నుకొంటుంది. ఈ స్థానిక గ్రంథాలయ సంస్థల సభ్యుల సభ్యత్వం వారిఎన్నిక లేదా నియామకపు తేదీనుండి మూడేండ్లవరకు అమలులో వుంటుంది. మధ్యలో

ఏర్పడే ఖాళీలలో వచ్చే సభ్యుల సభ్యత్వం ఖాళీ అయిన వారి సభ్యత్వపు గడువు కాలంతో ముగుస్తుంది. తమకుగల హోదా ననుసరించి సభ్యులుగా యేర్పడినవారి సభ్యత్వం ఆ హోదాతోపాటు తొలగిపోతుంది. ప్రతిసభ్యుడు ఎన్నిక ద్వారాగాని, నియామకం ద్వారాగాని మరల మరల సభ్యుడు కావచ్చు.

ఈ స్థానిక గ్రంథాలయ సంస్థలు తమ సభ్యులలో నుండి ఏడుగురికి మించకుండా కార్యవర్గముల నేర్పరచి తమ అధికారములను, విధులను పూర్తిగాగాని, కొంతవరకు గాని అట్టికార్యవర్గముల కప్పగించవచ్చును. ఈ సంస్థలు తామప్పగించు విషయములను విచారించి నివేదికలు సమర్పించుటకుగాని, సలహాచెప్పుటకుగాని అవసరమైనప్పుడు ఉపసంఘములను సహితము నియమించవచ్చును.

స్థానిక గ్రంథాలయ సంస్థ లేర్పాటవుతూనే వీలైనంత త్వరలో తమ యేరియాలో గ్రంథాలయాలను స్థాపించి ప్రజలకు గ్రంథాలయసేవ నందజేసేటందుకు ప్రణాళికలను సిద్ధపరచి డైరెక్టరుగారి ఆమోదాన్ని పొందవలసివుంటుంది. డైరెక్టరుగారి సవరణలు, చేర్పులతో అంగీకృతమైన ప్రణాళికలను అమలుపరచవలసివుంటుంది.

ప్రతి స్థానిక గ్రంథాలయ సంస్థయు తమ ఆదాయ వ్యయముల లెక్కలను వ్రాసియుంచి అధికారులు కోరినప్పుడీ లెక్కలను వారికి చూపవలెను.

ప్రభుత్వ సహాయానికి అర్హమైన గ్రంథాలయాలు కొనే పుస్తకాల జాబితాల నామోదించే బాధ్యతకూడా యీ సంస్థలకు అప్పగించడమైనది.

అధికారాలు :

చట్టరీత్యా యేర్పడే పౌరగ్రంథాలయాలకు కావలసిన స్థలాలను, భవనాలను, బీరువాలు వగైరా సామగ్రిని, యితర పరికరాలను సమకూర్చుటకును, పుస్తకాలతోను, పత్రికలతోను, దేశపటాలతోను, శాస్త్రములకు కళలకు సంబంధించిన పరికరములు, పుస్తకాదులు, మ్యాజికులాంతరు బొమ్మలు, సినిమా ఫిల్ములు మొదలగు వస్తువులతోను గ్రంథాలయాలను నింపుటకును; వీని కవసరమగు సిబ్బందిని నియమించుటకును స్థానిక గ్రంథాలయ సంస్థల కధికారముండును. ప్రభుత్వం వారి ఆమోదంతో ఏదేని పౌర గ్రంథాలయాన్ని మూసివేయుట లేదా ఎత్తివేయుట లేదా స్థలాన్ని మార్చుట, గ్రంథాలయ నిర్వహణకు సంబంధించిన ఏలాటి ధర్మములనుగాని స్వీకరించుట, ఉపన్యాసాల యేర్పాటు, వైజ్ఞానిక తరగతుల నిర్వహణము, శాసనోద్దేశాన్ని నెరవేర్చేటందుకు చేయవలసిన యితర కార్యాలు చేయడానికి యీ సంస్థలు సమర్థములు.

ప్రజలు గ్రంథాలయాలలో ప్రవేశించడానికి అవసరమైన షరతులను - రుసుములను నిర్ణయించుట, గ్రంథాలయాల నుపయోగించ గోరేవారు వాటి ఆస్తుల సక్రమ

నిర్వహణకు పూచీపడేలాగు చూచుట, గ్రంథాలయాల ఆస్తుల వినియోగానికి విధానాలను - రక్షణకు యేర్పాటులను సూచించుట, శాసనానికి దీని క్రింద యేర్పడు నిబంధనలకు వ్యతిరేకంగా ప్రవర్తించేవారి నెవ్వరినైనా యేగ్రంథాలయం నుండి గాని తొలగించడానికి తమ ఉద్యోగులకు సేవకులకు అధికారమిచ్చుట వగైరా యీసంస్థల అధికారములోని అంశములే. కాని ప్రభుత్వం తమకు తోచిన రీతిని యీ పేరాలో సూచించిన విధులనిర్వహణానికిగాను చేయబడిన నిబంధనలను మార్చడానికిగాని, రద్దుచేయడానికిగాని అవకాశమున్నది. అయితే యీపనిచేసేముందు స్థానిక గ్రంథాలయ సంస్థవారు తమ వాదాన్ని చెప్పుకోవడానికి ప్రభుత్వం అవకాశమివ్వాలి.

అవసరమని తమకుతోచిన సందర్భాలలో స్థానిక గ్రంథాలయ సంస్థల రద్దుకు, పునర్నిర్మాణానికి ప్రభుత్వం పూనుకోవచ్చు. కాని యీ పనులు చేసేముందు తాము తీసుకోదలచు చర్యలకు కారణాలను తెలిపి యీ సంస్థల జవాబులను తెప్పించి పరిశీలించవలెను.

స్థానిక గ్రంథాలయ సంస్థలన్నీ తమతమ యేరియాలలో గ్రంథాలయ సెస్సును విధిస్తాయి. ఆస్తిపన్ను లేదా యింటిపన్నుపై ప్రతిరూపాయికీ ౬ పైసలవంతున యీసెస్సు విధించడమవుతుంది. ఈరేటును ప్రభుత్వం కోరికపైగాని ఆమోదంతోగాని హెచ్చించడానికి వీలున్నది. ఈ సెస్సుల వసూలు బాధ్యత మదరాసులో కార్పొరేషనుకు, జిల్లాలలో

మునిసిపాలిటీలకు, పంచాయతీ బోర్డులకు, జిల్లాబోర్డులకు పెట్టినారు.

సెస్సులద్వారా వసూలయ్యే మొత్తాలు, యీమొత్తాలకు తగ్గకుండా ప్రభుత్వమిచ్చే నిధులు, దాతలనుండి వసూలయ్యే విరాళాలు, ధర్మాలు, ప్రభుత్వంవారిచ్చే ప్రత్యేక విరాళాలు, ఆయాగ్రంథాలయ సంస్థలు వసూలుచేసే రుసుములు, జరిమానాములు చేరి గ్రంథాలయనిధిగ యేర్పడుతుంది. ఈ నిధులను స్థానిక గ్రంథాలయ సంస్థలు తమకు సమీపంలోగల గవర్నమెంటుట్రెజరీలో నిల్వయుంచవలెను. ప్రభుత్వంవారి అంగీకారంతో కారణాలను తెలిపి ప్రభుత్వానుమతిగల స్థానిక బ్యాంకులో కరెంటు అక్కౌంటును కూడ పెట్టుకోవచ్చును. వెంటనే అవసరంలేని పైకాన్ని గవర్నమెంటు సేవింగ్సు బ్యాంకులోగాని, గవర్నమెంటు సెక్యూరిటీలలోగాని, వారనుమతించిన యితర సెక్యూరిటీలలోగాని పెట్టుబడి పెట్టవచ్చును. దీనికి ముందుగా ప్రభుత్వం అనుమతిని పొందవలెను.

విమర్శ :

పైన వివరించిన స్థానిక గ్రంథాలయ సంస్థల విధులు, అధికారాలు చూడడానికి చక్కగానే వున్నాయి. కాని అసలు స్థానిక గ్రంథాలయ సంస్థల నిర్మాణంలోనే చాలా లోపం కనపడుతుంది. ప్రజాస్వామిక రాజ్యంలో నామినేషనుల పద్ధతీ, జనసామాన్యంయొక్క విజ్ఞాన వ్యాప్తికై చిర

కాలం నుండి నిరంతరాయంగా కృషిసల్పుతున్న ప్రజా గ్రంథాలయాలకు న్యాయంగా వుండవలసిన ప్రాతినిధ్యం లేక పోవడమూ, అనుగుణంగా ప్రభుత్వమూ డైరెక్టరూ ప్రమేయం కలుగుజేసుకొనడానికి కావలసినన్ని అవకాశాలు గ్రంథాలయ శాసనం ద్వారానూ, దీని ననుసరించి తయారైన నిబంధనలద్వారానూ యేర్పడినవి. కనుక గొప్ప మార్పులు వస్తేతప్ప యీ శాసనం ప్రజలకు పూర్తిగా ఉపయోగించడం పొసగదు. ప్రజలు గ్రంథాలయాల నిర్వహణ కొరకప్రక్క పన్నువిస్తూ, వీని నుపయోగించుకొనడానికి మరల రుసుములు చెల్లించవలె ననడం సబబుగా లేదు. ఆధునిక గ్రంథాలయా దర్శాని కీ పద్ధతి పూర్తిగా విరుద్ధమైనది. స్థానిక స్వపరిపాలన సంస్థలకై మనకిదివరకే ప్రత్యేకసంస్థలమలులోనుండగా, తిరిగి గ్రంథాలయాల నిర్వాహణ కొరకు వేరే సంస్థల నేర్పాటుచేయడం చాల వ్యయకారణము, అనవసర ప్రయాసము. రాష్ట్రంలో గ్రంథాలయోద్యమ వికాసాని కీ చట్టము ప్రస్తుతరూపంలో సరిగా తోడుపడజాలదని గ్రంథాలయాల విషయంలో ప్రపంచ ప్రసిద్ధులైన డాక్టరు యస్.ఆర్. రంగనాథన్‌గారు గట్టిగా చెప్పినారు. స్థానిక గ్రంథాలయ సంస్థలకు కార్యదర్శులను ప్రభుత్వం నియమించడాన్ని వీరు విమర్శించినారు. గ్రంథాలయాల విషయంలో అనుభవంలేని

విద్యాశాఖాడైరెక్టరును గ్రంథాలయాల డైరెక్టరుగా నియమించినట్లే, గ్రంథాలయానుభవం లేని ఉద్యోగులను మరే శాఖ నుండియైన తెచ్చి స్థానిక గ్రంథాలయ సంస్థలకు కార్యదర్శులుగ నియమించడం జరిగితే కలిగే నష్టాన్ని వీరు ఎత్తిచూపినారు. గ్రంథాలయోద్యమంలో మార్గదర్శకములుగా నున్న దేశాలన్నీ యీయన మాటను పాటిస్తున్నాయి. కాని మన ప్రభుత్వానికి మాత్రం వీరి సలహాలు చెవికెక్కలేదు. కనుక జిల్లా విద్యాశాఖాధికారులను స్థానిక గ్రంథాలయ సంస్థలకు కార్యదర్శులుగ నియమించడం సంభవించినది.

మదరాసు పౌర గ్రంథాలయముల చట్టము

# అధ్యాయము ४

## గ్రంథాలయాల డైరెక్టరు

మదరాసు పౌర గ్రంథాలయశాసననిర్వహణ నిమిత్తం రాష్ట్రప్రభుత్వం డైరెక్టరు సుకరిని నియమిస్తుందనీ, వారి అధికారానికిలోబడి యీయన ప్రభుత్వంవారునిర్మించే కేంద్ర గ్రంథాలయాన్ని దాని శాఖలను పరిపాలిస్తాడనీ, యీశాసనాన్ననుసరించి యేర్పడే పౌరగ్రంథాలయాల విషయంలో పర్యవేక్షకుడుగా సలహాదారుగా పనిచేస్తాడనీ, యీ చట్టము ననుసరించి తయారగు నిబంధనల కనుగుణంగా ప్రభుత్వసహాయాని కర్హమైన గ్రంథాలయాలను నిర్ణయించి వీనిని కూడా పర్యవేక్షిస్తూ వీటి నిర్వహణకు కావలసిన సలహాల నిస్తూ వుంటాడనీ, ఈచట్టం క్రింద యేర్పడే స్థానిక గ్రంథాలయ సంస్థల పర్యవేక్షణ కంట్రోలు అధికారముల నీతడు చలాయిస్తాడనీ, ఏటేటా గడచిన సంవత్సరంలో గ్రంథాలయము లెట్లు పనిచేసినదీ ప్రభుత్వానికి నివేదిస్తూ వుంటాడనీ, ఈ చట్టంద్వారాగాని, దీని ననుసరించి చేయబడు నిబంధనల ద్వారాగాని, తనకు సంక్రమించే యితర బాధ్యతలను, అధికారములను నిర్వహిస్తూవుంటాడనీ మూలశాసనంలోని 4వ సెక్షనులో సూచించబడినది.

నిబంధనలలో విద్యాశాఖ డైరెక్టరే అధికారరీత్యా గ్రంథాలయాల డైరెక్టరుగా వుంటాడని ప్రకటించినారు. గ్రంథాలయాలకుగల ప్రాధాన్యత దీనితో సగము తుడిచి పెట్టుకొని పోయినది. ఇప్పటికే అనేక రకములైన బాధ్యతలు విద్యాశాఖ డైరెక్టరు నిర్వహించుచున్నాడు. ఈకార్యక్రమం చక్కగా సాగాలనే వుద్దేశ్యమే ప్రభుత్వమువారికి వుంటే అభినివేశములేని అదనపు బరువును ఈయనపై పెట్టడం జరిగేదికాదు. ఈయన సహాయార్థం ప్రత్యేకోద్యోగిని ప్రభుత్వం నియమిస్తున్నప్పటికీ ఈ ఉద్యోగి డైరెక్టరుగారి చిత్తాన్ని అనుసరించి నడుచుకోవలసిన వాడవుతాడు. కనుక స్వేచ్ఛా వాతావరణంలో పనిజరగడాని కవకాశముండదు.

డైరెక్టరు నియామకం, ఆయన విధులను గూర్చిన వివరాలు మూలచట్టం 4 వ సెక్షనులో సూలంగా ఇవ్వబడినవి. చట్టంలో చాల చోట్ల ఈయన ప్రస్తావన కానవస్తూ వున్నది.

స్థానిక గ్రంథాలయ సంస్థల నిర్మాణ నిర్వహణములలో యీయన జోక్యం పూర్తిగా వుంటుంది. ప్రభుత్వ సహాయాన్ని కోరే గ్రంథాలయాల విషయంలో యీయన అధికారం అంతులేనిదిగా వున్నది. ఈయన దయలేనిది చట్టరీత్యా యేర్పడే పౌర గ్రంథాలయాలుగాని, ప్రభుత్వ సాయమర్థించే ప్ర జా గ్రం థా ల యా లు గా ని అడుగుతీసి అడుగుపెట్టుటకు వీలులేదు. మూలచట్టంలో సూలంగా చెప్పిన అంశాలకు వివరాలేగాక యీయన అధికారాన్ని

పెంచే నూతన ప్రతిపాదనలు కూడ నిబంధనలలో చేర్చబడినవి. చట్టరీత్యా జిల్లాలలోను మదరాసు నగరంలోను యేర్పడే స్థానిక గ్రంథాలయ సంస్థలు పూర్తిగ డైరెక్టరు అనుగుజాడలలో నడచిననే తమ కార్యక్రమాలను నిరభ్యంతరంగా సాగించడానికి వీలవుతుంది. ఈ సంస్థల సభ్యులలో పలువురు వీరు నియమించినవారుగా వుంటారు. కనుక సహజంగా వారంతా వీరికనుకూలంగా నడవకతప్పదు. ఇంతేకాక ప్రతికాగితమూ డైరెక్టరుగారి ఆఫీసుకుపోయి వారుదానిని పరిశీలించి పంపవలసివస్తే రాష్ట్రం మొత్తానికి బాధ్యతవహించవలసిన వారిద్వారా పనులు కావడానికి జరిగే ఆలస్యాన్ని మనం ఊహించుకోవచ్చు. ఇప్పటికీ ఈవిషయంలో ప్రభుత్వ కచ్చేరీలలో ప్రజలుపడే యిబ్బందిని చూస్తూవున్న ఎవ్వరుగాని యీ పద్ధతి కంగీకరించరను సంగతిని చెప్పవలసిన పనిలేదు.

ముఖ్యమైన అధికారాలు:

1. స్థానిక గ్రంథాలయ సంస్థలు తమయేరియాలో ప్రజోపయోగం నిమిత్తం గ్రంథాలయాలను స్థాపించుటకు ప్రణాళికలను తయారుచేసి డైరెక్టరుకు పంపవలెను. వీనికి మార్పులుగాని, చేర్పులుగాని సూచిస్తూ డైరెక్టరు ఆమోదించుచో వీరి సూచనలను పై సంస్థలవారు విధిగా అమలు పరచవలెను.

2. తాను స్వయంగా ఒక పర్యాయం ఆమోదించిన ప్రణాళికను మార్చుటకుగాని, దానికి ప్రత్యామ్నాయంగా

మరొక ప్రణాళికను ప్రవేశ పెట్టుటకుగానీ డైరెక్టరు కధికారమున్నది.

3. ప్రభుత్వసహాయం పొందే గ్రంథాలయాల విషయంలో అవి యింట్లకు పుస్తకాల నరువియ్యడానికి నిబంధనలను డైరెక్టరు నిర్ణయించవలెను. సంవత్సరం మొత్తంపై అరువిచ్చు గ్రంథాల కనిష్ఠ సంఖ్యను కూడ యీాయన చెప్పవలెను.

4. భవనాలు, సిబ్బంది, మూలనిధి, వార్షికాదాయం ప్రమాణాలను యీాయన తీర్మానం చేయవలెను. గ్రంథాలయాలను నిర్వహించే సంస్థల పాలకవర్గములను యీాయన ఆమోదించవలెను. ఈ సంస్థల నిర్మాణ నిబంధనలలో, ఉపనిబంధనలలో మార్పులు చేయవలసిన డైరెక్టరు అనుమతించవలెను.

5. గ్రంథాలయ భవనము, మూలనిధి వగైరాలను డైరెక్టరు అనుమతి లేకుండా అన్యాక్రాంతం చేయుటకు వీలు లేదు.

6. వార్షిక లెక్కలను పరిశీలించవలసిన ఆడిటరు నియామకానికి గూడ డైరెక్టరు అనుమతి కావలెను.

7. భవనాదులకు ప్రభుత్వం గ్రాంటులిచ్చే సందర్భంలో వీని ప్లానులు, వివరాలు, అంచనాల (ఎస్టిమేట్లు) ను డైరెక్టరు ఆమోదించ వలెను. గ్రాంటుల నిర్ణయాధికారమంతా డైరెక్టరుదే.

# అధ్యాయము ౫

## ప్రజాగ్రంథాలయాలు : ప్రభుత్వసహాయం

బ్రిటిష్‌రాజ్యకాలంలో దేశ దాస్య విముక్తికై మన గ్రంథాలయాలు పడిన పాట్లు లోకవిదితమైనవి. ఆనాడు ప్రభుత్వ సాయంకొరకు మనగ్రంథాలయాలు పరితపించలేదు. అనేక కష్టములకోర్చి స్వయంకృషిపై ఆధారపడి ఏలాంటి యిబ్బందులనుగాని సరకుగొనక జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమంలో ఆంధ్రదేశంలోని గ్రంథాలయాలన్నీ తమతమ వంతుపనిని శక్తివంచన లేకుండా చేసినవి. పేరుకు కొన్నిగ్రంథాలయాలకు మన రాష్ట్రప్రభుత్వంవారు విరాళాలిస్తూ వచ్చినారేకాని యీ విరాళాలు పొందడానికి గ్రంథాలయాలెన్నో యిబ్బందులకు గురికావలసివచ్చేది. పట్టణాలలోని పెద్దగ్రంథాలయాలు తప్ప మారుమూలల గ్రామాలలోని చిన్నగ్రంథాలయాలకి సాయమెక్కడోగాని లభించలేదు. ఆయాగ్రంథాలయా లందుకొన్న విరాళాలు గూడ వాని ఖర్చుల కేమాత్రమును సరిపోలేదు. అప్పటి ప్రభుత్వానికి గ్రంథాలయాలపట్ల గల సవతితల్లి ప్రేమ మూలంగా ఉద్యమవ్యాప్తికి తగిన దోహదం లభించలేదు.

ఇంతలో మనదేశం స్వతంత్రమైనది. మదరాసు రాష్ట్రంలో విద్యామంత్రిగానున్న అవినాశలింగంగారి పట్టుదలమూలంగా ఇచ్చటి గ్రంథాలయ కార్యక్రమానికి దోహదంగా శాసనమొకటి ప్రవేశపెట్టబడినది. దీని స్వరూపం సెలెక్టుకమిటీ చేతుల్లో తల్లక్రిందులై ఒక వింత విధానం తయారైనది. నాలుగు దశాబ్దాలనుండి కార్యక్రమం సాగిస్తున్న ఆంధ్రగ్రంథాలయోద్యమనిర్వాహకులు, ప్రపంచంలో నేడు గ్రంథాలయోద్యమంలో ప్రసిద్ధివహించిన సుప్రసిద్ధ గ్రంథాలయాధినేత డాక్టరు యస్. ఆర్. రంగనాథన్‌గారు చేసిన సలహాలను సెలెక్టుకమిటీవారు చెవిని బెట్టలేదు. ఈవిధంగా బానిసతనపు రోజులనాటి పాతసాంప్రదాయాలతో మనకొక శాసనం తయారైనది. దీనిని అమలు చేసేటందుకు కొన్ని నిబంధనలను కూడా రాష్ట్ర ప్రభుత్వం వారు సిద్ధంచేసినారు.

ఇలా తయారైన నిబంధనల ప్రకారం నేడు రాష్ట్రం మొత్తంపైన రెండు రకాలగ్రంథాలయాలు మాత్రం నిలబడి పనిచేయడానికి అవకాశమున్నది.

1. చట్టము ననుసరించి స్థానిక గ్రంథాలయ సంస్థలేర్పరచి నడపు పౌరగ్రంథాలయాలు.

2. ప్రభుత్వ సహాయానికి అర్హమైనవిగా గ్రంథాలయాల డైరెక్టరు నిర్ణయించు ప్రభుత్వ సహాయమును పొందు గ్రంథాలయాలు.

సహకారసంఘములు, జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, పంచాయతీ బోర్డులు, ప్రైవేటు సంస్థలు, ఇటీవల మద్య నిషేధ ప్రాంతాలలో నెలకొల్పబడిన గ్రామ సంఘాలు నిర్వహించే గ్రంథాలయాలన్నీ యికపైన ప్రభుత్వ సహాయము పొందే గ్రంథాలయాలుగా అర్హతను సంపాదించుకోవలసి యుండును.

ప్రభుత్వ సహాయార్హత దిగువ నియమాలను పాటించే గ్రంథాలయాలకు లభిస్తుంది.

1. డైరెక్టరుగారి అంగీకారం పొందిన నిబంధనలకనుగుణంగా క్రమవర్తనము, ప్రజారోగ్యమునకు భంగము కలుగనంతవరకు గ్రంథాలయావరణములో స్థానిక ప్రజలంతా యథేచ్ఛగా ఏలాంటి రుసుములు లేకుండా పఠన యోగ్యమైనట్టియు, విజ్ఞాన ప్రదమైనట్టియు అన్ని పరికరములను చదువుకొనడానికీ, ఉపయోగించుకొనడానికీ అవకాశ ముండాలి.

2. వారానికి 30 గంటలకు తక్కువ లేకుండా గ్రంథాలయాన్ని ప్రజోపయోగం నిమిత్తం తెరచి వుంచాలి. గ్రంథాలయానికి నిత్యం వచ్చువారి సగటు హాజరు డైరెక్టరు నిర్ణయించు కనీస సంఖ్యకు తక్కువలేకుండా వుండాలి. గ్రంథాలయముండే స్థలం అన్ని జాతులవారు రావడానికి యోగ్యమైనదిగా వుండాలి. డైరెక్టరుఅనుజ్ఞలేనిదే యే ఒక్క వర్గంవారైనను రావడానికి వీలులేని మరొకస్థలానికి గ్రంథాలయాన్ని మార్చకూడదు.

3. గ్రంథాలయంలో దిన, వార, మాసపత్రికలతో పాటు పుస్తకాలు కూడా వుండాలి.

4. గ్రంథాలయాలు కొనవలసిన పుస్తకాల, పత్రికల జాబితాలను స్థానిక గ్రంథాలయ సంస్థవారు ముందుగా అంగీకరించాలి. పుస్తకములు కొనే సందర్భంలో దిగువ విషయాలను గమనించాలి.

(అ) ఇవి హెచ్చుమందికి ఉపయోగపడుతూ సాంస్కృతికంగా విలువగలవిగా వుండాలి.

(ఆ) నవలలు, కథలపుస్తకాలు కొనే సందర్భంలో ప్రామాణికులైన రచయితల గ్రంథములనే కొనాలి. అనుమానాస్పదమైన అభిరుచులను కలిగించు గ్రంథాలను చేర్చ గూడదు.

(ఇ) సాంఘిక, మతద్వేషాదులు పురికొల్పే పుస్తకాలను కొనరాదు.

(ఈ) అనుమానాస్పదమైన అభిరుచుల గలిగించునట్టియు, అసభ్యమైన చిత్రపటములు గలట్టియు పుస్తకాలు పత్రికలు కొనరాదు.

5. ప్రతి గ్రంథాలయములోను పుస్తకాలకు, సభ్యులకు విడివిడిగా రిజష్టరులను ఉంచవలెను.

6. డైరెక్టరుగారి ఆమోదాన్ని పొందిన నిబంధనలకు లోబడి పుస్తకాల నరు వియ్యవలెను. సంవత్సరం

మొత్తంపై అరువిచ్చే పుస్తకాల సంఖ్య డైరెక్టరుగారు నిర్ణయించే కనిష్ఠసంఖ్యకు తగ్గరాదు.

7. డైరెక్టరు నిర్ణయించు ప్రమాణముల ననుసరించి గ్రంథాలయ నిర్వహణమునకు చాలిన సిబ్బంది ఉండవలెను.

8. డైరెక్టరుగారికి తృప్తికరంగా, అవసరమైన సామగ్రి గల స్వంత భవనంలో గ్రంథాలయముండవలెను. డైరెక్టరు పై రెండు విషయాలలోను ఉండవలసిన ప్రమాణములను గూర్చి సలహాలిచ్చుచుండును.

9. డైరెక్టరు నిర్ణయం ప్రకారం గ్రంథాలయానికొక మూలనిధి, కనీస సంవత్సరాదాయము ఉండవలెను. సంవత్సరాదాయం క్రింద మూలనిధిపై వచ్చు వరుమానము, చందాలు, విరాళములు వగైరామాత్రం లెక్కకువచ్చును. ప్రభుత్వ విరాళం దీనిలో చేరదు.

10. డైరెక్టరు ఆమోదం పొందిన పాలకవర్గం గ్రంథాలయానికి యాజమాన్యం వహించి దానిని నిర్వహించాలి. ఈ సంఘం నిర్మాణనిబంధన, ఉప నిబంధనలు డైరెక్టరుకు ఫైలు నిమిత్తం పంపాలి.

ఏటేటా ప్రభుత్వ సహాయం పొందే గ్రంథాలయాల జాబితాలో తమ పేర్లను నిలిపియుంచుకోగోరు గ్రంథాయాలు దిగువ సంగతులను గమనించవలెను.

1. జాబితాలో చేరు నప్పుడు అంగీకరింపబడిన ప్రమాణములు, పరిస్థితులలో ఏమాత్రంగాని తగ్గుదల కానరాగూడదు.

2. అర్హతా ప్రమాణములు, పరిస్థితులు యథాతథంగానున్నట్లు డైరెక్టరు తృప్తిపడుటకై అప్పుడప్పుడు డైరెక్టరుగాని ఆయన ఏజెంట్లుగాని గ్రంథాలయాన్ని తనిఖీ చేయుట కంగీకరించవలెను.

3. డైరెక్టరు కోరిన ప్రకారం నియమిత కాలాల లోను, ప్రత్యేకంగాను గ్రంథాలయానికి సంబంధించిన లెక్కలు, నివేదికలు వారు కోరు వివరాలు చేర్చి పంపుచుండవలెను.

4. గ్రంథాలయ భవనము, ఇతర స్థిరాస్తులు, మూల నిధినగ్గరాలను డైరెక్టరు అనుమతి లేకుండాగాని, ఆయనకు సంతృప్తికరంగా వీని విలువలకు సమానమైన విలువలుగల ఆస్తులను చేర్చకుండా గాని అన్యాక్రాంతం చేయరాదు.

5. నిర్మాణ నిబంధనలలో గాని, ఉపనిబంధనలలో గాని గ్రంథాలయనిర్వాహకులు చేయుమార్పులు డైరెక్టరు అనుమతికి లోబడి జరుగవలెను. ఈ మార్పుల ప్రతులను డైరెక్టరుకు అందజేయ వలెను.

6. పాలకవర్గంలో జరిగే మార్పులను, మార్పుజరిగిన నెలలోపుగా డైరెక్టరుకు నివేదించవలెను.

7. ఏటేటా డైరెక్టరు అనుమతించిన ఆడిటరు తనిఖీచేసి ధ్రువపరచిన వార్షికలెక్కలను డైరెక్టరుకు పంపుచుండవలెను.

ప్రభుత్వంవారిచ్చు సహాయం వివరాలు :

1. భవనాలు, సామానులు వగైరాలకుగాను ఒకే దఫాయిచ్చు (పెద్ద) మొత్తాలు.

2. దిగువ పనులకొరకు ఏటేటా చెల్లించు (స్వల్ప) మొత్తాలు.

(అ) పఠనీయ పరికరాలు (అనగా పుస్తకాలు, పత్రికలు వగైరాల కొనుగోలు క్రింద)

(ఆ) బైండింగుకు, పఠన పరికరాల రక్షణకు

(ఇ) సిబ్బంది జీతాలనిమిత్తం

(ఈ) డైరెక్టరు అనుమతించిన శిక్షణాలయములో గ్రంథాలయ శిక్షణమును బడయు నిమిత్తము నియోగింపబడిన సిబ్బందికిచ్చు విరాళము.

(ఉ) ఇతరకార్యాలయ ఖర్చులు.

ఒకేదఫాయిచ్చు విరాళం డైరెక్టరు అంగీకరించిన ప్లానుల ప్రకారం, అంచనాల (ఎస్టిమేటు) కనుగుణంగా నిర్మాణం చేయబడిన ప్రధానమైన కట్టడములు వగైరాలకు మాత్రం వర్తించును.

ఈ విరాళాలు, మొత్తమయ్యే ఖర్చులో ఎప్పటికప్పుడు ప్రభుత్వం నిర్ణయించే నిష్పత్తి ప్రకారం ఆమోదం పొందిన అంచనా ననుసరించి, ప్రభుత్వం నిర్ణయించే అధిక మొత్తానికి మించకుండా వుంటాయి.

ఏటేటాయిచ్చువిరాళాలను, లెక్కలను తనిఖీచేసి ఆడిటరు తయారుచేసిన గత సంవత్సరం లెక్కలు, బ్యాలెన్సు షీటుల ఆధారంపై డైరెక్టరు నిర్ణయంచేస్తాడు. మొదటి సంవత్సరంవిరాళమిచ్చే గ్రంథాలయాల విషయంలో డైరెక్టరు ఆమోదించిన ఆసంవత్సరపు అంచనా లెక్క ఆధారంగా వుంటుంది. మొదటిసంవత్సరపు విరాళంలో ఏదైనా మార్పు చేయవలసివచ్చినట్లైన ఆ సంవత్సరంలో అయిన ఖర్చు ననుసరించి రెండవసంవత్సరంలో దానిని సరిపెట్టవచ్చును. గ్రంథాలయాలు చేయు ఖర్చులపై ప్రభుత్వం ఎప్పటి కప్పుడు నిర్ణయించు నిష్పత్తి ననుసరించి వార్షిక విరాళాలు నిర్ణయమవుతాయి.

పై ను ద హ రిం చ బ డి న నిబంధనల ప్రకారము నేడు ఆంధ్రదేశంలోగల గ్రంథాలయాలలో ఎన్ని ప్రభుత్వసహాయానికి అర్హమైనవిగా తేలునో చెప్పలేము. ఇంతకు పూర్వంగల స్వల్పమాత్రపు షరతులనే పాటించజాలక చాల గ్రంథాలయములు భయముచేతను, విసుగుచేతను, ప్రభుత్వ విరాళములనైన వదలు కొనుటకు సిద్ధపడిన సంగతి గ్రంథాలయ శాసనాన్ని, దీనిక్రింద నిబంధనలను తయారు చేసిన వారెరిగి యున్న వీని రూపము తప్పక వేరుగానుండెడిది. దేశం నలుమూలల ప్రజాసేవను ప్రాతిపదికగా పెట్టుకొని బయలు దేరిన వందలాది ఆంధ్ర గ్రంథాలయాల భవిష్యత్తుకు మన ప్రభుత్వంవారి శాసనంగాని, దానిననుసరించి, చేయబడ్డ నిబంధనావళిగాని ఆశాజనకంగా లేవు.

# అధ్యాయము ౬

## ఉపసంహారము

మదరాసు పౌర గ్రంథాలయముల శాసనంయొక్క చరిత్ర, స్వరూప స్వభావములు వెనుకటి అధ్యాయములలో సంగ్రహముగ వర్ణింపబడినవి. దీని ననుసరించి ప్రభుత్వం వారు జారీచేసిన నిబంధనల ప్రస్తావనయు వీనిలో కొంత గలదు. ఆ యా విషయములకు సంబంధించిన సామాన్య విమర్శలుకూడ అధ్యాయాంతములందు పొందుపరుపబడినవి. శాసన నిర్మాణానంతరం వివిధదశలలో జరిగిన కార్యక్రమ వివరాలను జాగ్రత్తగ పరిశీలించినయెడల ప్రస్తుత పద్ధతిలో ఆదర్శమైన సమగ్ర గ్రంథాలయసేవకు త్వరలో అవకాశము లభించునని తోచదు.

ఈచట్టము 1948 వ సం॥ కడపట తీర్మానమైనది. దీని క్రింద నిబంధనలు 1950 ఫిబ్రవరి మాసాంతమున ప్రకటింప బడినవి. 1950 ఏప్రిల్ 1 వ తేదీనుండి యిది అమలు జరుగునట్లు ప్రభుత్వంవారు ప్రకటనచేసిరి. ఈ ప్రకటనానంత రము కేంద్రమున రాష్ట్రీయ గ్రంథాలయ కమిటీయు, మద రాసు నగరమునను - జిల్లాలలోను వేరువేరుగా స్థానిక గ్రంథాలయ సంస్థలును నిర్మాణము చేయబడినవి. ఈపను లన్నీ పూర్తియగునప్పటికి దాదాపు 7 నెలలు పట్టినది.

ముఖ్యంగా స్థానిక సంస్థలు జిల్లా గ్రంథాలయ సంస్థలకు తమ ప్రతినిధులనెన్నుకొనుటలో చాల జాగు చేసినవి. జిల్లాలలో యేర్పడిన గ్రంథాలయ సంస్థల మొదటిసమావేశములలో జిల్లాబోర్డులను, మునిసిపాలిటీలను, పంచాయతీబోర్డులను 1-4-1950 వ సం॥ నుండి గ్రంథాలయసెస్సును వసూలుచేసి పంపవలసినదిగ కోరుచు తీర్మానములు చేయబడినవి. ఈ చట్టము ననుసరించి నియమింపబడిన గ్రంథాలయాల ప్రత్యేకాధికారి జిల్లాలలో సంచారముచేసి స్థానిక గ్రంథాలయ సంస్థల సమావేశములకు హాజరై ఆయాజిల్లాలలో గ్రంథాలయసేవ నిమిత్తం ప్రణాళికల రచనకు మార్గములను సూచించియున్నారు. ప్రతిజిల్లా గ్రంథాలయసంస్థకు ప్రణాళికలనుసిద్ధపరచుటకై కార్యనిర్వాహకవర్గములు యేర్పాటు చేయబడినవి.

స్థానిక గ్రంథాలయసంస్థలకు తమ గ్రంథాలయాలను స్వాధీనము చేయవలసినదిగా ఇంతకు పూర్వం నడుస్తూవున్న గ్రంథాలయ పాలకులను కోరుతూ వివిధజిల్లా గ్రంథాలయ సంస్థల కార్యనిర్వాహక వర్గములు తీర్మానములు చేసినవి.

సెస్సు వసూలు విషయంలో మొదటి సంవత్సరం ఒక్క మదరాసు నగరంలో మాత్రం పనిచురుకుగా సాగినది. జిల్లాలలో కొన్ని జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు సెస్సు వసూలు బాధ్యతనుండి తప్పించుకొనుటకు సహితము చూచినవి. స్థానికసంస్థలు చాలభాగం మొదటి సంవత్సరంలో సెస్సులు వసూలు చేసినట్లు తోచదు. ఇందువిషయమై ప్రభుత్వముకూడ తగిన శ్రద్ధవహించినట్లు కనబడదు.

1950 అక్టోబరులో యేర్పడిన రాష్ట్రీయ గ్రంథాలయకమిటీ 1950 నవంబరు 24 వ తేదీన విద్యామంత్రి గౌరవనీయులు కె. మాధవమీనననుగారి అధ్యక్షతను ఒక్కసారి సమావేశమైనది. ఈ సమావేశములో గ్రంథాలయాలకనుకూలించు పుస్తకాల జాబితాల నిర్మాణానికి, గ్రంథాలయ నిర్వహణనిమిత్తం సుశిక్షిత బృందపు యేర్పాటుకు రెండుపసంఘములు నియమింపబడినవి. ఈ ఉపసంఘము లిప్పటికి కూడినట్లు తెలియదు. ఈ శాసన నిర్వహణవిషయమై ప్రభుత్వం చేస్తున్నపనిసంగతి రాష్ట్రకమిటీసభ్యులకు తెలుపబడుటలేదు. ప్రజలకు కూడ దీని సమాచారం బొత్తుగా తెలియుటలేదు. పైన పేర్కొనబడిన ఉపసంఘముల సభ్యులకు కూడ కొందరికి వారి నియామకం వృత్తాంతం సహితము తెలిసినట్లు కనబడదు.

ఇతరులు స్థాపించి నడపు గ్రంథాలయాల నప్పగించుకొని పనిచేయుట కెదురుచూస్తూ, చేత డబ్బులేక, తమ ప్రణాళికల నమలు జరుపుటకు స్వతంత్రములేక, అధికారయుతంగా జరుగవలసినపని కావున ప్రజల కభిమానములేక, అధికారులకు తగిన ఆసక్తిలేక జిల్లా గ్రంథాలయసంస్థలన్నియూ ఇంతవరకు ఒక్క అడుగైన ముందుకు వేయలేదు. ఈ సంస్థల సభ్యులలోకూడ హెచ్చుమంది గ్రంథాలయోద్యమంతో యేలాటి సంబంధం లేనివారుకావడంచేతకూడ వీని సమావేశము లుత్సాహంగా జరుగుటలేదు. ఈ సంస్థలు తమ కార్యక్రమాన్ని ప్రారంభించుటకు వీలుగా రాష్ట్రప్రభుత్వం వారొక్కొక్క దానికి రు 8000/- అడ్వాన్సు

చేసినట్లీమధ్య ఒక వార్త వినవచ్చినది. ఈ స్వల్ప మొత్తంతో జిల్లా గ్రంథాలయసంస్థలు చేయగల కార్యమేమో తెలియదు. పైగా వీరి ప్రణాళికలు డైరెక్టరుగారి అనుమతిని పొందవలెనే అసలు జరుగుటకవకాశముండకుండా! సులభంగా సాధించవలెనని చిరకాలనుండియున్న గ్రంథాలయాల స్వాధీనం వీరి కిచ్చుటను ప్రోత్సహించినట్లు కానరాదు. కనుక స్థానిక గ్రంథాలయసంస్థల కార్యక్రమము మొగ్గలోనే స్తంభించి పోయినట్లు కానవచ్చుచున్నది. ఈ స్థితినుండి యీ సంస్థల నుద్ధరించవలసిన భారము ప్రభుత్వ నిర్వాహకులపైన, వీరికీవిషయంలో సలహానిచ్చి నడుపవలసిన బాధ్యత యీ శాసన నిర్వాహణోద్యోగులపైన నున్నది.

కొన్ని ముఖ్యమైన సంగతులు:

1933 వ సం॥లో గ్రంథాలయ శాసనం మదరాసు శాసనసభలో ప్రవేశపెట్టబడినప్పుడు మన దేశపరిస్థితుల కిది అనుగుణంగా లేనందున దీనిని ఉపసంహరించుకొనుట మంచిదని ఆంధ్రగ్రంథాలయోద్యమ నిర్వాహకులు సూచించిరి. గ్రంథాలయాల నిర్వహణానికి క్రొత్త పన్నులు వేయు ఆలోచనను వీరు నిరసించిరి. నిర్బంధోచిత ప్రాథమిక విద్యాచట్టమువలె గ్రంథాలయ శాసనము నిరర్థకము కాకుండ చూడవలెనని హెచ్చరించిరి. కాకినాడలో జరిగిన 16 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభాధ్యక్ష పీఠమునుండి కీ. శే. శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారు చాలదేశములలో వ్యవసాయదారులిచ్చు పన్నులలో కొంతభాగము గ్రామస్వపరిపాలనమున కివ్వబడుచున్నట్లే ప్రభుత్వమువారి

సెవిన్యూ ఆదాయమునుండి గ్రంథాలయముల నిర్వహణకు కొంతసొమ్మును ప్రత్యేకించుట బాగుంటుందని సెలవిచ్చిరి. కేంద్రీకృతమైన ప్రత్యేకశాఖ యేర్పాటు మూలంగా స్థానిక ప్రజల స్వాతంత్ర్యమునకు, గ్రంథాలయ స్థాపనాసక్తికి ఆటంకము కలుగునని వీరనుకొనిరి. 1947 వ సం॥ మదరాసు ప్రభుత్వం ప్రకటించిన చిత్తుచట్టము విమర్శకై పటమట లంకలో కూడిన ప్రత్యేక ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ వారు గ్రంథాలయాల బిల్లుకు - గ్రంథాలయ, వయోజన విద్యల బిల్లని నామకరణం చేయగోరిరి. ప్రభుత్వ సహాయాన్ని పొందే గ్రంథాలయాలకు విరాళాలిచ్చే అధికారం స్థానిక గ్రంథాలయ సంస్థలకే వుండవలెనని వీరు తీర్మానించిరి. గ్రంథాలయోద్యమాభివృద్ధికి కేవలం సెస్సులమీద కంటె ప్రజల ఔదార్యంమీద, ప్రభుత్వ విరాళాలమీద ఆధారపడడం సముచితమని వీరభిప్రాయపడిరి. కార్యక్రమ నిర్వహణములో స్థానిక గ్రంథాలయ సంస్థలకు స్వాతంత్ర్యముండవలెననియు, సమన్వయానికి కావలసిన నిబంధనలను ప్రభుత్వం చేయవచ్చుననియు వీరు నిర్ణయించిరి.

ఈ మహాసభ అధ్యక్షోపన్యాసంలో శ్రీగాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు వెలిబుచ్చిన అభిప్రాయాలు సభవారి ఆమోదమును పొందినవి. వీనిలో ముఖ్యమైనవి:

1. దేశంలో ప్రస్తుతమమలులోనున్న ధర్మగ్రంథాలయాలు సక్రమంగా లేవనుట సత్యంకాదు.

2. దేశంలో గ్రంథాలయాలను, వయోజన విద్యాలయాలను యేర్పాటుచేసి సార్వజనిక విద్యాప్రచారానికి ప్రభుత్వం పూనుకోవాలి; ఇది వారివిధి.

3. ఎయిడెడ్ గ్రంథాలయాలకు విరివిగా విరాళాలిచ్చి వీనిని ప్రోత్సహించుట ప్రభుత్వం యొక్క ముఖ్యకర్తవ్యం. ప్రస్తుతమిది మిక్కిలి అనుసరణీయం. ఎయిడెడ్ గ్రంథాలయాలకు విరాళాలిచ్చే విధానాలను చట్టంలోనే చేర్చడ మవసరం.

4. రాష్ట్రీయ గ్రంథాలయసంఘం, స్వతంత్రంగా తనకు తోచిన సలహాలు చెప్పడానికవకాశముండాలి. దీనికి ప్రాంతీయ భాషాశాఖలుకూడా వుండాలి.

5. డైరెక్టరు స్థానిక గ్రంథాలయ సంస్థలకు మిత్రుడు, సచివుడు, బంధువుగా ఉపచరించవలసినదేకాని శాసనకర్తగా యజమానిగా యేర్పడకూడదు.

6. ఒక్కొక్క భాషాప్రాంతానికి ఒక్కొక్క కేంద్ర గ్రంథాలయం యేర్పరచవలెను. ప్రతిజిల్లాకు ఒక ముఖ్యగ్రంథాలయాన్ని స్థాపించవలెను.

7. గ్రంథాలయ శిక్షణకు యేర్పాటులు ప్రత్యేకంగా వుండవలెను. స్థానిక గ్రంథాలయ సంస్థలు తరగతులు పెట్టడానికీ, ఉపన్యాసాలిప్పించడానికీ ఉద్దేశాలలో యేర్పాటుంచినామంటే చాలదు.

ప్రభుత్వము వారు ప్రకటించిన 1947 సంవత్సర చట్టముపై బయలుదేరిన మరికొన్ని అభిప్రాయములు, సూచనలు దిగువ నుదహరింపబడినవి.

"...ప్రతిపాదనము అన్నివిధముల సంపూర్ణ సమర్థనీయము కాదు..."

—[illegible]

"...ప్రజల ఉత్సాహముచే నడుపబడుచున్న గ్రంథాలయముల స్వాతంత్ర్యమును ఏమాత్రము నిరోధించకుండ వీనికి అవసరమగు ఆర్థిక సంపత్తి సమకూర్చుచు, చక్కగ బహుజనోపయోగముగ నివి నడచునట్లు చేయుటయు, గ్రంథాలయోద్యమాభివృద్ధికి వీనిని ప్రథమ సోపానములుగ గ్రహించుటయు కర్తవ్యములు..."

—శ్రీ [illegible] రామచంద్రరావు

"...మన దేశంలో దేవాదాయ, ధర్మదాయాలు చాలావున్నవి. వాటి ఉద్దేశ్యం విజ్ఞాన ప్రసారంగా కనబడుతుంది. అట్టి సంస్థలను ప్రభుత్వం తీసుకొని వాటి ఆదాయాలను గ్రంథాలయాల నిర్వహణకు, వాటి భవనాలను గ్రంథాలయాలకు ఉపయోగించవచ్చును.

"...ప్రజాహృదయం చూరగొని గ్రంథాలయోద్యమంలో కృషిసల్పిన గ్రంథాలయ సేవకులను యేరి 2, 3 నెలలు ప్రాథమిక శిక్షణయిచ్చి యీ నిర్మాణంలో సమన్వయించుకోవడం అవసరం.

"వయోజన విద్యాప్రచారానికి కావలసిన యేర్పాట్లను గ్రంథాలయాలే చేయాలి. ఆవిధంగా వయోజన విద్యా

లయాల నిర్వహణకు కూడ ప్రస్తుత శాసనంలో అవకాశం కల్పించాలి."

—శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య

"...విస్తృతమైన విషయపరిజ్ఞానము, సమర్థత, ఉత్సాహము, మనఃస్ఫూర్తిగా పనిచేసే స్వభావముగల యువకుడు గ్రంథాలయాల డైరెక్టరుగ ప్రత్యేకం ఏర్పాటు చేయబడియున్న గ్రంథాలయ శాసనం ద్వారా యీనాటికెంతో మేలు కలిగియుండేది. గ్రంథాలయ శాసనాన్ని బోలిన, చాలా కాలానికిగాని కనబడని ప్రయోజనాన్ని ప్రసాదించే సాంఘిక శాసనాన్ని లాభసాటిగా నడపడానికిగాని, పాడుచేయడానికిగాని కారణభూతుడు మొదటి డైరెక్టరేగదా !"

—డాక్టర్ యస్. ఆర్. రంగనాథన్

పటమటలంకలో కూడిన ప్రత్యేక గ్రంథాలయ మహాసభలో ప్రవేశ పెట్టుటకై డాక్టరు యస్. ఆర్. రంగనాథన్‌గారు పంపిన తీర్మానం:

"విద్యాశాఖ కనుబంధంగా గ్రంథాలయశాఖ నేర్పాటుచేసి, గ్రంథాలయ చట్టంలోని అంశముల నమలుపరచుటకును, రాష్ట్రంలోని గ్రంథాలయోద్యమం సాంఘిక మైనట్టియూ, అనవసరభయముల కవకాశము లేనట్టియు పద్ధతులతో సర్వతోముఖాభివృద్ధి చెందునట్లు చూచుటకును, గ్రంథభాండాగారి వృత్తిలో నున్నవారిని గ్రంథాలయాల డైరెక్టరుగా నియమించవలసినదిగ యీ మహాసభవారు మదరాసు ప్రభుత్వంవారికి సూచిస్తున్నారు."

వ్యాఖ్య : "దూరదృష్టి లోపమువలన ఆత్మహత్యాసదృశముగ పరిణమించు రెండు ప్రమాదములకు గురికాకుండ ప్రభుత్వము తప్పించుకొనవలెను. క్రొత్తగా బయలుదేరిన

గ్రంథాలయోద్యమాన్ని విద్యాశాఖవారి దయాధర్మబిచ్చాలపై ఆధారపడేలాగు చేయడంగాని, గ్రంథాలయ విధాన ప్రాశస్త్యాన్ని శక్తుల్ని లేదా అవసరాల్ని గ్రహించ నవకాశం లేని విద్యాశాఖోద్యోగుల యాజమాన్యంలో దీని నిర్వహణాన్ని వదలడంగాని పనికిరాదు. గ్రంథాలయ చట్టాన్ని యేర్పరచుకొని, సంపూర్ణ వికాసంగల గ్రంథాలయ శాఖ యేర్పాటుకు అంగీకరించకపోవడం గ్రంథాలయాభివృద్ధిని విద్యాశాఖ కప్పగించి, యిది విఫలం కావడంతో వివేకాన్ని పొంది, ప్రత్యేకంగా గ్రంథాలయ శాఖల నేర్పరచుకొన్న యితర దేశాల అనుభవాన్ని త్రోసిపుచ్చినట్లవుతుంది. ఈ విధానం పరిహాసాస్పదంగా పరిణమిస్తుంది. ఇందు మూలంగా గ్రంథాలయోద్యమం అపకీర్తిపాలవుతుంది. గ్రంథాలయాలపట్ల ప్రజానీకానికిగల ఉత్సాహం పూర్తిగా చల్లారి యీ ఉద్యమానికి మేలుకంటె కీడే యెక్కువ కలుగుతుంది. మంత్రులతో నేరుగా వ్యవహారంచేసే శాఖలు వీలైనంత తక్కువగా వుండడం ప్రభుత్వ సంకల్పమని చెప్పే వాదం సహేతుకమైనదికాదు."

చిత్తుచట్టంలో వున్న లోపాలను సవరించుటకు బదులుగ సెలెక్టు కమిటీవారు దురదృష్టవశాత్తు అభివృద్ధిని నిరోధించు కొన్ని కొత్తరాజులను శాసనంలో ప్రవేశపెట్టినారు. పుస్తకానికీ, పాఠకునికీ మధ్య రుసుము అనే అంతరాయాన్ని వీరు చొప్పించినారు. ఉచితంగా అందరికీ విజ్ఞానాన్ని అందజేయ వలసిన ధర్మం గ్రంథాలయాలకు ప్రాణప్రదమై యుండగా, దానిని వీరుల్లంఘించి రుసుములు వసూలుచేసే అధికారాన్ని

వీరు పబ్లికు లైబ్రరీలపై పెట్టినారు. ఇదిచాలా అనుచితం. వీరు చేసిన మరియొకమార్పు స్థానికసంస్థలపట్ల అపనమ్మకానికి దారితీస్తున్నది. మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు వగైరా స్థానిక సంస్థలను స్థానిక గ్రంథాలయ సంస్థలుగా చిత్తుచట్టం అంగీకరిస్తే స్థానిక గ్రంథాలయ సంస్థలను ప్రత్యేకంగా యేర్పాటు చేయుటకు వీరు తీర్మానించినారు. వివిధములగు స్థానికసేవల నిమిత్తం విడివిడి కమిటీల నేర్పరచడం వలని చెడుగులను వందలాది యేండ్ల అనుభవంమీాద చాలదేశాలు గ్రహించి స్థానిక కార్యాలన్నింటిని చక్కబెట్టుటకు సకలార్థ సాధకములగు స్థానిక సంస్థల నిర్మాణమునకు పూనుకొనుట లోకవిదితము. అయినను యీా అనుభవాన్ని గ్రహించి తదనుగుణంగా నడచుకొనుటకు మదరాసు రాష్ట్ర శాసన సభ్యులంగీకరించక పోవుట మన దురదృష్టమని చెప్పక తప్పదు. వీరి తిరోగమనపద్ధతి మూలంగా గ్రంథాలయ శాసన నిర్వహణం సాఫీగా సాగడం పొసగదు.

ఈ శాసన విషయంలో యిప్పుడు చేయదగిన కార్యం కనబడదు. త్వరలో క్రొత్త యెన్నికలు జరుగనున్నవి. యెన్నికలలో పోటీచేయు వివిధపార్టీల అభ్యర్థులకు ప్రస్తుత శాసనంలోని లోపాలను తెలిపి విజయులగువారు వీని సవరణకు కృషిసల్పునట్లు జిల్లాలలోని గ్రంథాలయాల కార్య కర్తలు ఉద్యమ నిర్వాహకులు ప్రయత్నించవలెను. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారాదినుండీ చెప్పుతున్న ప్రకారం ప్రస్తుతం పనిచేస్తున్న గ్రంథాలయాలకు ప్రభుత్వం పూర్తిగా తోడ్పడి వీనిస్వేచ్ఛకు భంగంలేనిపద్ధతిని యివి

ప్రజాసామాన్యంలో విజ్ఞానవ్యాప్తికి స్థానిక గ్రంథాలయ సంస్థలు నిర్ణయింపను ప్రణాళికలో భాగస్వాములుగా నుండి పనిచేయుటకు నవకాశములు కల్పించవలెను. ఈ విషయంలో జరుగవలసిన కార్యక్రమాన్ని సంగ్రహంగా తెలుపునట్టి ౩౮ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ తీర్మానము మూడవ అనుబంధంలోనూ, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారి సలహా ననుసరించి తయారు చేయబడిన జిల్లాప్రణాళిక స్థూల రూపాంశాల అనుబంధంలోనూ యివ్వబడినవి. ఈ అనుబంధాలలోని విషయాలను మదరాసు రాష్ట్ర ప్రభుత్వదృష్టికి, స్థానిక గ్రంథాలయ సంస్థలదృష్టికి తెచ్చి యీనవీ సూచనలు అమలు జరుగునట్లు చూడవలసినవిధి గ్రంథాలయోద్యమాభివృద్ధికై పాటుబడు ప్రతివానిపైనను గలదు.

జైహింద్

# సారస్వత పట్టిక

ఈ గ్రంథ రచనలో తోడ్పడిన సారస్వత వివరములు

*Govt. of Madras—Education and Public Health Department :*

The Madras Public Libraries Act, 1948

Rules made by His Excellency the Governor of Madras in exercise of the powers conferred by Section 18 (1) of the Madras Public Libraries Act, 1948.

A bill to provide for the establishment of public libraries in the Province of Madras and the organisation of a comprehensive rural and urban library service there.

Memorandum No 13320—E/51—1 Education dated 30 th April, 1951.

(Sub: State Library committee-Members)
List of members of Local Library Authorities

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము :

గ్రంథాలయ సర్వస్వము సంపుటం ౯ సంచికలు ౧,౨
డిటో ,, ౧౨ ,, ౨

Amendments to the Madras Public Libraries Act.

౨౮ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ తీర్మానములు

Indian Librarian Vol 3. No. 2

The First Library Act (సమీక్ష)

*K. M. Sivaraman :*

A brief history of the Madras Public Libraries Act (manuscript)

*S. R. Ranganathan :*

Observations of the Madras Public Libraries Act. (౨౭వ ఆం. దే. గ్రం. మహాసభకు పంపిన వ్యాసము)

వావిలాల గోపాలకృష్ణయ్య :

జిల్లాల్లో గ్రంథాలయ ప్రణాళికలు

(11-10-50 వ తేదీ 'విజయవాణి'లోని వ్యాసం)

పాతూరి నాగభూషణం :

గ్రంథాలయశాస్త్ర ప్రథమ పాఠములు

గ్రంథాలయములు [వ్యాసావళి]

అనుబంధము ౧.

## రాష్ట్రీయ గ్రంథాలయ కమిటీ సభ్యులు

1. విద్యామంత్రి: గౌ॥ కె. మాధవమీనను గారు

2. స్థానిక స్వపరిపాలన శాఖామాత్యులు:
గౌ॥ కె. చంద్రమౌళిగారు

3. విద్యాశాఖ డైరెక్టరు: శ్రీ యస్. సదాశివరెడ్డిగారు

4. ప్రత్యేకాధికారి: శ్రీ యల్. బుల్లెయ్యగారు

5. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ ప్రతినిధి:
శ్రీ మద్ది సుదర్శనంగారు

6. మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ ప్రతినిధి:
శ్రీ టి. యస్. పట్టాభిరామన్ గారు

7. మదరాసు యూనివర్సిటీ ప్రతినిధి:
శ్రీమతి మోనాహెన్స్మన్ సతిగారు

8. ఆంధ్రయూనివర్సిటీ ప్రతినిధి:
శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు

9. అన్నామలై యూనివర్సిటీ ప్రతినిధి:
దివాన్ బహదూర్
సి. యస్. శ్రీనివాసాచారియర్ గారు

10. మదరాసు గ్రంథాలయ సంఘ ప్రతినిధి:
శ్రీ కె. యమ్. శివరామన్ గారు

11. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ ప్రతినిధి:
శ్రీ పాతూరి నాగభూషణంగారు

12. కేరళ గ్రంథాలయసంఘ ప్రతినిధి :
శ్రీ ఇ. రామన్ మీనన్‌గారు

13. కన్నడ గ్రంథాలయ సంఘ ప్రతినిధి :
శ్రీ యస్. వనియప్పభట్‌గారు

14. గ్రంథాలయ ప్రవీణుడు :
శ్రీ ఆర్. జనార్దనంనాయుడుగారు

మదరాసు నగర గ్రంథాలయసంస్థనుండి నియమితులైన

15. శ్రీ టి. పి. మీనాక్షిసుందరం పిళ్లైగారు

రాష్ట్రంలో వివిధ జిల్లాలలోని స్థానిక గ్రంథాలయ సంస్థల సభ్యుల నుండి నియమితులైన

16. జనాబ్ పి. పి. ఉమర్ కోయాగారు (మలబారుజిల్లా)

17. శ్రీ ఎ. చిదంబర శెట్టిగారు (అనంతపురం)

అనుబంధము ౨

## తెలుగుజిల్లాలలోని స్థానికగ్రంథాలయ సంస్థల అధ్యక్షులు

శ్రీకాకుళం : డాక్టరు జి. వెంకట్రావు నాయుడుగారు

విశాఖపట్నం : శ్రీ టి. ఆర్. శర్మగారు
కార్యదర్శి, క్యాంప్‌బెల్ లైబ్రరీ, విశాఖపట్నం

తూర్పుగోదావరి : శ్రీ మూరిన నరసన్నగారు, బి. ఏ.
తూ. గో. జిల్లాబోర్డు అధ్యక్షులు, కాకినాడ

పశ్చిమగోదావరి : శ్రీ డి. యస్. సుబ్రహ్మణ్యంగారు
సి. ఆర్. ఆర్. కాలేజి ప్రిన్సిపాల్, ఏలూరు

కృష్ణా : డాక్టరు రాళ్లబండి అచ్యుతరామయ్యగారు
మునిసిపల్ ఛైయిర్మన్, మచిలీపట్టణము

గుంటూరు : శ్రీ శరణు రామస్వామిచౌదరిగారు
గుంటూరుమండల గ్రంథాలయ సంఘాధ్యక్షులు
కూచిపూడి, తెనాలి తాలూకా

నెల్లూరు : శ్రీ పి. వి. సుబ్బారెడ్డిగారు, మునిసిపల్ కౌన్సిలరు
నెల్లూరు

చిత్తూరు : శ్రీ బి. ఆర్. కుమార్‌గారు, ఎం. ఏ. (ఆక్సన్)
ప్రిన్సిపాల్, బిసెంటు కాలేజి, మదనపల్లి

కడప : శ్రీయన్. రంగారెడ్డిగారు, బి.ఏ., బి. యల్., యం. యల్. సి.
కడప

కర్నూలు : శ్రీ కె. బుచ్చిరెడ్డిగారు, బి. ఇ. (రాజీనామానిచ్చినారు)

అనంతపురం : శ్రీ పి. రాఘవేంద్రాచార్యులుగారు, ప్రధానోపాధ్యాయులు, శ్రీశాయిబాబా నేషనల్ హైస్కూలు
అనంతపురం

బళ్లారి : శ్రీ ఎ. పూర్ణప్రజ్ఞాచార్యులుగారు, మునిసిపల్ కౌన్సిలర్
బళ్లారి

అనుబంధము 3.

## ౨౧ వ ఆం. దే. గ్రం. మహాసభ, చాగలమఱ్ఱి

## గ్రంథాలయ శాసనమునకు సంబంధించిన తీర్మానము

అ. ప్రస్తుతము అమలులోవుండే 1949 వ సంవత్సరపు మదరాసు పబ్లిక్ లైబ్రరీల ఆక్టు అమలులోనికివచ్చి 18 మాసములైనా ప్రజలకు తృప్తికరమయిన ఏవిధమైన చర్యలు జరగకపోవుట వల్లనూ, ఇప్పుడు జిల్లా

బోర్డులు, మునిసిపాలిటీలు, పంచాయతీలు, ప్రత్యేక కమిటీలు నడుపుతూ వుంటే గ్రంథాలయాలను జిల్లా లైబ్రరీ అథారిటీలు తమ వశము చేసుకొనుటకు ప్రయత్నించి విఫలమనోరథులగుటయేగాక తాము అమలులో పెట్టదలచుకొన్న ప్రణాళికలు డైరెక్టరుగారి పరిశీలనలో నెలలాది వుండడంచేత నిస్సహాయులుగా వుండడంచేతను, ప్రస్తుతపు చట్టములో సర్వాధికారములు గ్రంథాలయాల డైరెక్టరను పేరుతో విద్యాశాఖాధికారి హస్తగతము చేసికొని తనతాబేదారులైన జిల్లావిద్యాశాఖాధికారుల మూలకంగా పరిపాలన సాగించడంచేత జిల్లా గ్రంథాలయ సంస్థలు ముందడుగు వేయటానికి సత్వరావకాశాలు లేకపోవడంచేత ఈశాసనాన్ని ఎంతత్వరగా వీలైతే అంత త్వరగా సంపూర్ణంగా సవరించిననేగాని ప్రయోజన మేమాత్రము ఉండదని ఈసభవారు అభిప్రాయపడుచూ, సవరణకు ఈక్రింది మూల సూత్రాలను సలహా చేస్తున్నారు.

(1) విద్యాశాఖ డైరెక్టరు, లైబ్రరీల డైరెక్టరు ఒకే అధికారి ఉండకూడదు. లైబ్రరీల డైరెక్టరు ప్రత్యేక హోదాతో ప్రత్యేకాధికారిగా యేర్పడవలెను.

(2) రాష్ట్రీయ గ్రంథాలయ కమిటీని, జిల్లా గ్రంథాలయ సంస్థలను అంటే జిల్లా లైబ్రరీ అథారిటీలను నియమించడములో విద్యా మంత్రికిగాని, విద్యాశాఖ డైరెక్టరుకుగాని, లైబ్రరీ డైరెక్టరుకుగాని ఏవిధమైన నామినేషను అధికారము ఉండరాదు, ఆయా వర్గములకు సంబంధించిన వ్యక్తులుగాని, సంస్థలుగాని ఎన్నుకొనే విధానమవలంబించవలెను.

(3) ప్రత్యేక సాంకేతిక పండితునిగాని, పండితులనుగాని, సంస్థలలో చేర్చుకొనే అధికారం తక్కిన సభ్యులంతా ఈ సంస్థకేర్పడిన తరువాత ఈ సంస్థలకే ఉండవలెను.

(4) జిల్లా విద్యాశాఖాధికారి కార్యదర్శిగా ఉండనవసరం లేదు.

(5) డైరెక్టరుకు చీటికి మాటికి జిల్లా గ్రంథాలయ సంస్థల కార్యక్రమమునందు అడ్డు తగలడానికి అవకాశం ఉండకూడదు.

(6) రాష్ట్రీయకమిటీ స్వతంత్రముగా ప్రతిపాదనలుచేసే అధికారము కలిగియుండవలయును.

(7) గ్రంథాలయాలలో ప్రవేశించి చదువుకొనడానికి ఏ విధమైన రుసుములు, చందాలు పెట్టుట కవకాశముండకూడదు.

ఆ. పైనసూచించిన సవరణలు జరిగేవరకు ప్రస్తుతమున్న యాక్టు ప్రకారం కార్యక్రమం అంతో యింతో నడువవలసివుంటే ఈ క్రింది విధానమును అవలంబించ వలసినదని ఈ సభవారి సూచన:

(1) ప్రస్తుతం నడుస్తూవుండే గ్రంథాలయాలను ఎయిడెడ్ గ్రంథాలయాలుగా రిజిష్టరు చేయడానికిగాని, గ్రాంటులు యివ్వడానికిగాని చేసిన, చేయబోయే నిబంధనలు ప్రస్తుత గ్రంథాలయాల స్వాతంత్ర్యాన్ని అరికట్టేవిగా ఉండకుండా చూడాలి.

(2) స్వంతభవనము, మూలనిధి, పాలకవర్గ నిర్ణయమునకు సాదా నిబంధనలకు డైరెక్టరుగారి అనుమతి, వీనికి సంబంధించిన నియమములు రద్దు కావలెను.

(3) ఇదివరలో వలెనే విద్యాశాఖాధికారులు తనిఖీచేస్తూ తమ అభిప్రాయములను సూచించినపిదప ఆ గ్రంథాలయములకు గ్రాంటు యిచ్చుటో, మానుటో తీర్మానించడానికి జిల్లా గ్రంథాలయ సంస్థలకు అధికారము పెట్టవలెను.

(4) ఇప్పుడు ఉండే గ్రంథాలయములతో లైబ్రరీ అథారిటీలు అగ్రిమెంట్లు చేసుకొని జిల్లాలైబ్రరీ కార్యక్రమాలనుగాని, బ్రాంచిలైబ్రరీ కార్యక్రమాలనుగాని, డెలివరీస్టేషను కార్యక్రమాలనుగాని వారిచేత చేయించవలెను. అట్టి అవకాశములు లేనిచోట్ల తమకున్న ఆర్థికోపపత్తితో గ్రంథాలయాల స్థాపనకు పూనుకొని కార్యక్రమమును నిర్ణయించవలెను.

(5) అందుకు తగిన సిబ్బందిని తయారుచేయటానికి కావలసిన ప్రణాళికలను సిద్ధపరచవలెను.

(6) జిల్లా గ్రంథాలయాలకు, గ్రాడ్యుయేట్లకు విశ్వవిద్యాలయాలలో ట్రైనింగ్ యిప్పించి లైబ్రేరియన్లుగా నియమించవలెను.

(7) బ్రాంచి లైబ్రేరియనులను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారు సంకల్పించిన 'గ్రంథాలయ నిర్వాహక' శిక్షణ యిప్పించి ఉద్యోగము లీయవలెను.

(8) డెలివరీ స్టేషనులను నడిపేవారికి ఆం. దే. గ్రం. సంఘము వారిదివరలో నడుపుతూవుండే 'గ్రంథాలయప్రవేశిక' శిక్షణ నిప్పించవలెను.

(9) ఈ మూడు దర్జాలవారికిని యిచ్చే వేతనములు, గ్రేడులు వగైరాలను సత్వరముగా నిర్ణయించవలెను.

(10) లైబ్రరీల డైరెక్టరును, ప్రత్యేకపు అధికారిగా నియమించవలెను. లేదా విద్యాశాఖ డైరెక్టరయినప్పటికీ తన విద్యాశాఖ డైరెక్టరు పదవితో సంబంధములేకుండా లైబ్రరీల డైరెక్టరుగా మాత్రమే అధికారమును నిర్వహిస్తూ అట్టి నిర్వహణలో కేంద్రకమిటీవారి సంప్రతింపులు, సలహాలను పొందవలెను.

అనుబంధము ౮.

# మాదిరి జిల్లా గ్రంథాలయ ప్రణాళిక

## జిల్లా ప్రధాన గ్రంథాలయం

దీనికి విశాలమైన భవనమొకటి వుండాలి. పుస్తకాలగది, పత్రికలగది, పరిశోధకులు ప్రశాంతంగా కూర్చొని చదువు, వ్రాతలపనిని సాగించడానికి ప్రత్యేక వసతులు యిందులో వుండాలి. ఈ గ్రంథాలయం ఆధునిక పద్ధతులపై నడవాలి.

ప్రతిజిల్లా గ్రంథాలయంలోనూ ప్రధానమైన ఆచూకీ గ్రంథాలు–నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు, డైరెక్టరీలు, గైడుపుస్తకాలు వగైరా–5000 వరకు తెలుగుగ్రంథాలు (ఇందులో అవసరాన్నిబట్టి కొన్నిగ్రంథాలు 2, 3 ప్రతులుకూడ సంపాదించవలెను), 2000 ఇంగ్లీషుపుస్తకాలు, 1000 హిందీ గ్రంథాలు, 500 సంస్కృత పుస్తకాలు జిల్లాలలోగలజనాభానుబట్టి ఉరుదు, కన్నడం, ఒరియా, తమిళ భాషలలో గ్రంథాలు కొన్ని ముందు చేర్చవలెను. ప్రజల అవసరాలను, అభిరుచులనుబట్టి యేటేట క్రొత్త

గ్రంథములను చేర్చవచ్చును. పుస్తకాలతోపాటు దేశపటాలు, మోటారు వాను, 16 మిల్లిమీటర్ల సినిమా ప్రొజెక్టరు, ఫిలిములు, గ్రామఫోను మెషిను, రికార్డులు, స్థానిక శిల్పము - కళలకు సంబంధించిన కొన్ని విగ్రహములు, పటములుకూడ ప్రతిజిల్లా ముఖ్య గ్రంథాలయములోను సంపాదించియుంచవలెను. తెలుగు దినపత్రికలు మొత్తం, రాష్ట్రంలోని ప్రధానమైన ఆంగ్లదినపత్రికలు, ఆంధ్రాంగ్లములలోని ప్రసిద్ధవారపత్రికలు, ఆంధ్రాంగ్ల హిందీ భాషలలోగల ఉపయుక్తమగు పక్ష, మాసాది పత్రికలు జిల్లా ముఖ్య గ్రంథాలయమందలి పఠనమందిరమున నుండవలెను.

ఇంగ్లీషు భాషాపరిచయంగల ప్రాచ్యభాషాపండితుడుగాని, తెలుగు భాషలో మంచి ప్రవేశమున్న ఆంగ్లపట్టభద్రుడుగాని గ్రంథాలయశాస్త్రమున ఉత్తీర్ణుడైన వ్యక్తిని జిల్లా గ్రంథాలయ ప్రధాన భాండాగారిగా నియమించి యాతనికి నెలకు రూ 150—250ల జీతమును నిర్ణయించవలెను. పైయోగ్యతలతోపాటు హిందీ సంస్కృతముల పరిచయమున్నవారికి ముందవకాశమివ్వవలెను. నెల 1 కి రు 75-125 వేతనముపై యిద్దరు సహాయభాండాగారులను, రు 40-60 స్కేలుపై ముగ్గురు పరిచారకులు, నెల 1 కి రు 15-0-0 లు చొప్పున ఒక ఊడ్చు మనిషిని, రూ 30-0-0ల మాసిక వేతనముపై రాత్రికాపలా మనిషిని యేర్పాటు చేయవలెను.

## శాఖా గ్రంథాలయాలు

ప్రతి మునిసిపాలిటీకి ఒకటి, ప్రతి తాలూకాకు కనీసం రెండు వంతున ముఖ్యకేంద్రాలలో శాఖాగ్రంథాలయముల నేర్పాటుచేయవలెను. ప్రతిశాఖా గ్రంథాలయానికి అనుబంధంగా పఠనమందిరమొకటి వుండవలెను. అనుకూలాలున్నచోట్ల శాఖాగ్రంథాలయాలలో ఉపన్యాస మందిరాలనుకూడ యేర్పాటు చేయుటమంచిది.

దీనికి కావలసిన సిబ్బంది:

నెల 1 కి రు 70—100 స్కేలుపైన ప్రధాన భాండాగారి

50—75 ,, ఇద్దరు సహాయభాండాగారులు

నెల 1-కి రు 30—50 స్కేలుపైన ఒక పరిచారకుడు
20 ల వేతనముపై రాత్రి కాపలా మనిషి
5 ల ,, ఊడ్పు మనిషి

ప్రధాన భాండాగారి కనీసం స్కూలుఫైనలు పరీక్షనిచ్చి, గ్రంథాలయశాస్త్రములో సర్టిఫికెట్టును పొందిన వాడుగ నుండవలెను. మాతృభాషయైన తెలుగు చక్కగా మాట్లాడను, వ్రాయనుగల వారినే యీ పనికెంచుకోవలెను. ముఖ్యముగా కలుపుగోలు తనము, సంఘసేవాభిలాష గలవారినే యీ ఉద్యోగానికి నియమించవలెను.

ఒక్కొక్క శాఖాగ్రంథాలయము 3000 పుస్తకాలతో ప్రారంభించవచ్చును. ఇందధిక భాగము తెలుగు గ్రంథములే యుండవలెను. ఆయా శాఖాగ్రంథాలయములు పనిచేయు ప్రాంతజనుల అవసరాలను, అభిరుచులను అనుసరించి ఏయే భాషలలో యెన్ని పుస్తకములుండదగునో నిర్ణయించవలెను. స్థానికులు హెచ్చుగా ఉపయోగించే గ్రంథాలనుమాత్రం శాఖాగ్రంథాలయములు సంపాదించి తక్కినవానిని జిల్లాగ్రంథాలయము నుండి కావలసినప్పుడు తెప్పించి తిరిగి పంపుచుండవచ్చును. ఒక్కొక్క జిల్లాలోని శాఖాగ్రంథాలయముల సంయుక్త గ్రంథపట్టికను జిల్లా గ్రంథాలయములో నుంచవలెను. పరస్పర సంప్రతింపులతోనూ జిల్లాగ్రంథాలయమువారి సలహాతోనూ ప్రతిశాఖా గ్రంథాలయము ఒక్కొక్క విషయానికి సంబంధించిన వాఙ్మయమును పూర్తిగా సేకరించుటకు ప్రయత్నించవలెను. ఈ ప్రత్యేక వాఙ్మయ సేకరణ సందర్భమున ఆయా శాఖా గ్రంథాలయములందు ప్రాంతీయ అవసరాలను గమనించవలెను.

ఒక్కొక్క శాఖాగ్రంథాలయము ఆయా పట్టణ లేక తాలూకా ప్రాంతములోని పాఠకులందరికీ కావలసిన పుస్తకముల నందజేయు బాధ్యతను వహించవలెను. కనుక ఒక్కొక్క శాఖా గ్రంథాలయము తాను పనిచేయు ప్రాంతపు కేంద్ర గ్రంథాలయముగా నుండును. ఇచ్చటనుండి గ్రామకేంద్రములకు వాయిదాప్రకారం పుస్తకాలుపంపు యేర్పాటుండవలెను. ఈ పని

కొరకు ప్రత్యేకం సైకిలు బండ్రోతుల నిర్ధరిని నె 1 కి రు 30_50 స్కేలు పైన నియమించవలెను.

అప్పుడప్పుడు ప్రజల అనుదినజీవితానికి సంబంధించిన వివిధ సమస్యలపైనను, లోకజ్ఞానమును కలుగజేయునట్టి వివిధ విషయములపైనను గ్రామాదులలో ఉపన్యాస కార్యక్రమములనుకూడ శాఖా గ్రంథాలయములు సాగించవలెను. ఈ కార్యక్రమ నిర్వహణంలో జిల్లా గ్రంథాలయమువారి సినిమా ప్రొజెక్టరును వీరుపయోగించవచ్చును. దీనికి తోడుగా మ్యాజికులాంతరు, విజ్ఞానప్రచారమునకు గ్రంథాలయం-వయోజనవిద్యా విషయములకు సంబంధించిన బొమ్మలు శాఖాగ్రంథాలయాలవారు సంపాదించి తమప్రచార కార్యక్రమాలలో ఉపయోగించుకోవచ్చును.

## గ్రామ కేంద్రాలు

శాఖాగ్రంథాలయాల ఆధ్వర్యంక్రింద ఆయాప్రాంతములలో నూరేసి గ్రంథపాఠకులున్న గ్రామాలలో గ్రంథాలయ కేంద్రాల నేర్పాటు చేయవలెను. ఈ కేంద్రాలను సేవాపరులగు స్థానికుల ఆధ్వర్యంక్రింద నడుపవలెను. ఉపాధ్యాయులీ పనికి బాగా అనుకూలపడగలరు. వీరికి గౌరవవేతనం క్రింద నెలకు కనీసం రు 12-0-0 యివ్వవలెను. ఈగౌరవోద్యోగులకుగ్రంథాలయనిర్వహణంలో సామాన్య శిక్షణను యివ్వవలెను. గ్రామకేంద్రాలకు నెలకొకపర్యాయం 50 నుండి 100 పుస్తకాలను పంపుచు పాతపుస్తకాలను వాపసు తీసుకొనుచుండవలెను. పుస్తకాలతో పాటు ముఖ్యములైన పక్ష, మాసాది పత్రికల సంచికలను, కరపత్రము లను కూడ గ్రామ కేంద్రాలకు అందజేయవచ్చును.

అక్షరాస్యత తక్కువగానున్న గ్రామాలలో వయోజన విద్యాలయములను స్థాపించి సాగించుటకుకూడ జిల్లా గ్రంథాలయప్రణాళికలో తావుండవలెను. ఈ విషయంలో ప్రస్తుతం మనరాష్ట్ర ప్రభుత్వం వారు చేస్తున్నపనిని యీ ప్రణాళిక ఆధారంగా చేసుకోవచ్చును.

జిల్లాగ్రంథాలయ ప్రణాళికలో యింతకుపూర్వం వివిధసంస్థల యాజమాన్యాన నడుస్తూవున్న గ్రంథాలయాల స్వాతంత్ర్యానికి భంగం

కలుగకుండా వాని యజమానులతో ఒడంబడికలు చేసుకొని ఆయా గ్రంథాలయాలను అనుకూలాన్నిబట్టి జిల్లా గ్రంథాలయాలుగాను, శాఖా గ్రంథాలయాలుగాను, గ్రామ కేంద్రాలుగాను పనిచేయించవచ్చును. ఈ విధమైన ఏర్పాటుల మూలంగా 'ఎక్కువ జనాభాకు తక్కువ వ్యయంతో చక్కని గ్రంథాలయసేవ' సమకూడగలదు. జిల్లాలోని అన్నిగ్రంథాలయాలు కలసి పనిచేయుటద్వారా ఈ ఉద్యమానికెంతో బలము చేకూరగలదు. ఆయా గ్రంథాలయాల అంతరువుకు తగిన నియమావళిని ప్రభుత్వం స్థూలంగా నిర్ణయించి ప్రకటించవచ్చును. ఈ నిర్ణయాలను పాటించి నడచే గ్రంథాలయాల నిర్వహణానికి స్థానిక గ్రంథాలయ సంస్థలుగాని, లేనిపక్షంలో ప్రభుత్వంగాని వలయుధనమును విరాళంగా యివ్వవచ్చును.

# విషయానుక్రమణిక (Index)

# గ్రంథకర్త యితర రచనలు

| | |
|---|---|
| గ్రంథాలయశాస్త్ర ప్రథమపాఠములు | రు 3-0-0 |
| గ్రంథాలయములు [వ్యాసావళి] | 2-0-0 |
| గ్రంథాలయములు : ఉపన్యాసము | 0-6-0 |
| గ్రంథాలయ గీతాలు (సంపాదితము) | 1-0-0 |
| గ్రంథాలయ పత్రికలు | |
| గ్రంథాలయ సూత్రాలు | 0-8-0 |
| గ్రంథాలయ సూక్తులు | |
| పఠనమందిరాలు | 1-0-0 |
| గ్రంథాలయ ప్రచారం : విజ్ఞానవ్యాప్తి | 0-8-0 |
| గ్రంథాలయ సహకారము | |
| తెలుగు పుస్తకాల వర్గీకరణము | 0-5-0 |


: ప్రకాశకులు :

గ్రంథాలయ పుస్తకశాల

[illegible]